"తెనిగించితి మని గానీ
యనువాదము చేసినార మనిగానీ మే
మనమూ ముని నుడుల ప్రతి
ధ్వనియూ యెదనొదవియిట్లు వాకున వెడలెన్."

అని యాంధ్ర కుశలవులుగా రామాయణాన్ని గ్గానము చేయుచు 1. బాల కాండము 1477, 2. అయోధ్యాకాండము 3405, 3. అరణ్యకాండము 1228, 4. కిష్కింధకాండము 1764, 5. సుందరకాండము 553 పద్యములు మొత్తము 8,427 పద్యములు వ్రాసిన తరువాత 1955 జూన్‌లో మా తండ్రిగారు పార్వతీశముగారు స్వర్గస్థులైనారు. కవిరాజహంసల లేఖినీ ముఖంగా చివరగా వెలువడిన పద్యము.

"తెలిగలువ గుత్తివలెని
ర్మలుడగు శశియపుడు గగనమధ్యగతుండై
వెలుగుచు నీలోదకమగు
చలువకొలనినడుమ హంసచాడ్పునదోచెన్."

అని యా హంసద్వయంలోని యొక హంస యమరత్వాన్ని పొందింది.

చిరకాలాను బంధము గలిగిన తన జంటకవి వియోగబాధలో శ్రీ బాలాంత్రపు వేంకటారావుగారు జంటను విడిపించిన రామాయణ రచనము జోలికి పోలేదు. మా తండ్రిగారు చనిపోవుచు తన చేతి యుంగరమును నా చేతికి తొడుగుచు నా కప్పగించిన రామాయణము శేషభాగములను అనగా 5. సుందరకాండము 1 70, 6. యుద్ధకాండము 3,465, అరణ్యకాండము 326, మొత్తము 5,261 పద్యములను వ్రాసి ఆరు కాండములను పూర్తి చేసితిని.

భారత మహాసంగ్రామంలో భగవద్గీత పుట్టింది. సంసార సమరంలో కొట్టుమిట్టాడుచు తండ్రిగా బాధ్యతలు తీర్చుకోలేని యచ్యుతుని యాత్మసంక్షోభంలో నీ యచ్యుతగీతావతరణం జరిగింది. పూర్వులను పునీతులుగా చేయడానికి, వంశాభివృద్ధికి

ఈ నా కృషికి యెంతో నైతికబలాన్ని నా పెద్దకూతురు చి॥ సౌ॥ చాగంటి సీతాలక్ష్మి, నా రెండవ కుమారుడు చి॥ పార్వతీశము అందించారు.

వాసము ఒకరిదైనా గ్రాసము తన దవ్వాలంటారు. అట్లు కాక

వాసము గ్రాసము కూడా పరులదైన పరభృతాన్ని నేను.

ఈ నా విషాదాన్ని నా పిఠాపురపు సోదరుల యాత్మలందలి పరమాత్మ శ్రీకృష్ణునెదుట పెట్టుకొనడానికే యీ యుద్యమం.

"చిత్రములు స్వామినీ వింతచేష్టలన్ని"

ఈనా సాహసమును మన్నించి యందలి గుణదోషములను పాఠకులు చూపినచో వినయపూర్వకముగా సవరించు కొనగలవాడను. అట్టి వారికి నేనెంతయో కృతజ్ఞుడను.

ఇట్లు
విధేయుడు,

వోలేటి అచ్యుతరామచంద్రమూర్తి.
గ్రంథకర్త

వందనము సేతుగోపగో విందునకును
వందనము సేతుసురముని వందితునకు,
వందనము సేతుయదుకులా భరణమునకు
స్వీకరింపంగదయజూపి స్వీయకృతిని
పార్థసారథివైనయో పరమపురుష !
పాదదాసుడనీకిదె ప్రార్థనంబు. 5

గీ. పాఠకులకిప్డు పద్యంబు పనికిరాని
వచనయుగమున నీవు నా ప్రాపునిలిచి
ధారణమునకు ననువుగాదారిచూపు
పద్యకృతియిదిగ్రహియింపు ప్రభువరేణ్య ! 6

గీ. పుట్టిపెరుగనిమఁదుడౌ పురుషుచేత
యేండుపదు లేండ్లునిండిన వృద్ధుచేత
గీతప్రాయించినట్టి శ్రీ కృష్ణునికృప
పరిమితములేనిగంగాప్రవాహమట్లు
లాకుచేలునిదని పెను అటుకులుతిని
యీకుచేలునిదనుపదా యీకృతివిని. 7

వోలేటి అచ్యుత రామచంద్రమూర్తి

కీర్తిసదనము
గాంధీనగర్,
**కాకినాడ.**

గీ. కనుము గురుదేవ పాండవాగ్రజుని సేన
ద్రుపదపుత్త్రుండు నీ శిష్యుఁడుపమనెర్గి
వ్యూహరచనము గావించి యున్న సేన
అరి భయంకరమైనది యతులితమును. (3)

గీ. అందు శూరులు విలువిద్య నారితేరు
వీరులున్నారు పార్థాభ భీమసములు
ఆహవంబున నెదురు లేనట్టివారు
అజయుఁడైనట్టి ద్రుపద మహారథుఁడును,
సాత్యకివిరాటరాజును సాయుధులయి. (4)

గీ. నరవరుఁడు శైబ్యుఁడును మరి పురజితుఁడును,
ధృష్టకేతువు, శిశుపాల నృపసుతుండు,
చేకితానుఁడురిపులోక భీకరుండు,
వారణాసిని పాలించు ప్రభువరుండు
కుంతి భోజాది రణరంగ కోవిదులును. (5)

గీ. విక్రముఁ డగు యుధామన్యు విభువరుండు
నుత్తమౌజుండు, నుర్వీశు, డురుబలుండు
ద్రౌపదేయులు మరి సుభద్రాసుతుండు,
సర్వులునటమహారథ సములెదెలియు. (6)

గీ. ద్విజవరుండవు గురువరా దెలుపుచుంటి
వీరు లెవ్వరో మనసేన నాయకులెవరో
సర్వసైన్యంబుగాపాడు శక్తులెవరో
జ్ఞాపకార్థంబు సమరంబు సలుపుకొరకు. (7)

గీ. నీవు భీష్ముండు, కర్ణుండు, నీ సుతుండు,
సమర జయశీలి కృపుడును, సైంధవుండు,
సౌమ దత్తివికర్ణుడున్ సమరమునకు
ముఖ్యులెల్లరు మనదైన మొగ్గరమున. (8)

గీ. వీరలేగాక పెక్కురు వీరవరులు
అస్మదర్థంబు పోరువా రసువులొడ్డి
యస్త్రవిద్యావిశారదు లైనవారు
యుద్ధకుశలురు, దోర్బలు లుండిరిచట. (9)

గీ. భీష్మ పాలితమైననా వీరసైన్య
మమితమయ్యును నపరిపూర్ణ ముగనుండె,
పార్థుడును భీముడునుగల పాండుసేన
యల్పమయ్యును పరిపూర్ణ మగుచుదోచె (10)

గీ. కానమీరలునియమిత స్థానములను
వీడకుండగదీర్పుడు విధులనన్ని

కంటకని పెట్టుచుండుదు గంగపుత్రు
సర్వసైన్యాధిపతిని మీ శక్తిగోలది. (11)

ఆనగా సంజయు డిట్లుచెప్పుచున్నాడు.

గీ, "అచటి సేనలవిషయంబు లట్లుచెప్పి
యరి బలంబుల భీతిల్లి యరసినట్టి
పౌత్రు దుర్యోధనునిలోని భయముమాన్ప
శంఖనాదంబు చేసెను శాంతనవుడు. (12)

గీ. శంఖ మతడట్లు పూరింప సమరమునకు
సమయ మదియని యెఱ్గుచు శత్రులెల్ల
చేసిరప్పుడు తమతమ చేతనున్న
శంఖపణవానకముల పెన్ శబ్దములను (13)

గీ. అవల తెల్లని గుఱ్ఱాల యరదమందు
నధివసించిన కృష్ణుడు నర్జునుండు
నాత్మశంఖారవంబుల నడుపుచేసి
రని కిసిద్ధంబుమేమని యన్నయట్లు (14)

గీ. పాంచజన్యంబు కృష్ణుండు పట్టియొత్తె
అర్జునుడు దేవదత్తంబు నందియొత్తె
నరి భయంకరుడనునట్టు లనిలసుతుడు
పౌండ్రశంఖంబు నొత్తె నప్పట్టునందు. (15)

గీ. కవలలు సుఘోషమణి పుష్పకములనొత్త
ధర్మరాజొత్తె దనయనంతవిజయమును
యమసుతుండను, పగరకు యముడననుచు
దిక్కులదరంగ విద్విషు లుక్కురంగ. (16)

గీ. పరశేరుండగు కాశిరా డ్వరవిభుండు,
అజితవిక్రమశాలి సాత్యకి నృపుండు,
ద్రుపదపుత్రుడును మహారథుడు శిఖండి
మరియు విరటుండు నాదియా ధరణినృపులు, (17)

గీ. ద్రౌపదేయులు ద్రుపదుండు దర్పబాహు
డైన సౌభద్రితోడుగా నందరపుడు
సాహసించుచు తమతము శంఖములను
వేగ పూరించిరో రాజ విక్రమమున. (18)

గీ. పాండు శంఖారవంబది ప్రబలమగుచు
మారుమ్రోగెను హృదయ విదారకముగ
నయ్యె కౌరవసేన క య్యదనునందు
హర్ష దాయక మదియ య్యె నన్యులకును. (19)

గీ. ఉభయసేనలు శంఖంబులొత్తగా నె
సమరసన్నద్ధుడగుచు నా సవ్యసాచి

రణసముత్సుకులైన కౌరవులగాంచి
యెక్కువెట్టుచు గాండీవ మిషువుదొడ్గి
యాత్మసారథి కృష్ణుతో నవియె నిట్లు. (20)

అర్జునుడు చెప్పుచున్నాడు.

గీ. "నిలుపుమచ్యుతరథము సేనలకుమధ్య
దుష్టుడైనట్టిరారాజు నోడ్పడియెడు
యుద్ధకాముకులైనట్టి యోధవరుల
నెవ్వరెవ్వరి నే నిప్పు డెదురవలెనొ
అట్టి శూరుల నే నిందు నరయుకొరకు" (21)

సంజయుడు చెప్పుచున్నాడు.

గీ. "అర్జునుడట్లు శ్రీకృష్ణు నడిగినంత
నరదమాతడునిల్పె సేనలకుమధ్య
కురుపితామహ భూమీశ్వరులకు నెదుట
అరయు మర్జున యదెకురు బలమటుచు" (22)

గీ. "అనగనందలియుభయ సైన్యములయందు
యుద్ధతత్పరమతులైన యోధవరుల
పితృ పితామహగురుజన వృద్ధవరుల
బావలను, బావమరదుల, బంధుజనుల,
మేనమామల, మనుమల మిత్రవరుల

నగ్రజానుజులనెగాక యాత్మజులను
నరసియార్త్రితదుఃఖించి యర్జునుండు
బంధుప్రీతికివశ్యుడై పామరువలె
నాత్మసారధికృష్ణుతో నవియెనిట్లు. (23)

అర్జునుడు చెప్పుచున్నాడు.

గీ. "ఈ రణస్థలి నాకిప్పు డెదురునిలిచి
పోరవచ్చినయాప్తుల శూరులగని
పిడుచకట్టెను నాలుక సడలెకేళ్ళు
వడకెగాత్రంబు మరి గగుర్పొడిచెమేను. (24)

గీ. జారెచాపంబు నాదు హస్తమున నుండి
మనసుచలియించె, మేనున మంటలలమె
నధివసింపంగ లేకుంటి నరదమందు,
దుష్టశకునంబులెన్నియో దోచుచుండె
నా యశక్తతతోడుగా నోయి! కృష్ణ!
అర్థరహితము యుద్ధ మనర్థమంచు
బంధుమారణమదియెంతో పాపమనుచు. (25)

గీ. వలదు విజయంబురాజ్యముల్ వలదునాకు
స్వజనులనుజంపి కొన్నట్టి సమరజయము,
ఎల్లజీవుల బలిగొని ఏలుకంటె
బ్రతికియున్నను చచ్చినా క్షితి నొకండె. (26)

గీ. ఎవరి సౌఖ్యంబునాశించి ఈ స్వరాజ్య
మభిలషింపంగ నుంటినో యట్టివార
లసువులర్పింప నిటనుండి రందువలన
నట్టివారల నాప్తుల నాజియందు
చంపి సాధించునది యెద్ది జగతిమీద. (27)

గీ. వారు బంధులు, మిత్రులు, భాతృవరులు,
మనుమలును, మేనమామలు, మరి గురులును,
బావలును, బావమరదులు, స్వజనములును,
శత్రువులు నాకునైనను చంపవారి
త్రిభువనంబులు పాలించు ప్రభుతకైన
అల్పమైనట్టి నారాజ్యమందు కొరకు
చంపుకొందున వారి నీ జన్యమందు. (28)

గీ. ఎవరు దుర్మార్గులనియెంచి ఇప్పుడిందు
చంపనున్నామొ యట్టి యీ స్వజనములను
మనమెచంపంగ చూచుట మానవతయె ?
అపుడు మనమేలకాకుందుమా సురులము,
పాపులనుజంప పాపంబె ప్రాప్తమగును. (29)

గీ, అందుచేతనే అచ్యుతా ఆప్తవరుల
చంపి సాధించునది లేదు జగతిమీద
పోరునష్టంబు లాభంబు పొత్తుగాన
బంధువుల జంపి సౌఖ్యంబు బడయగలమె?
రక్తపుంగూడు గుడువంగ రక్తిలేదు. (30)

గీ. దాయభాగంబునాశించి ధర్మదూరు
లైన ధృతరాష్ట్రపుత్రులీ యాహవమున
కులవినాశముఁగాని మిత్రులకుగల్గు
ద్రోహమునుగాని, తలపక ధూర్తులగుచు
యుద్ధమొనరించుటకెమది నుత్సహింత్రు. 31

గీ. అన్ని దెలిసియు నేనిప్పు డాహవింప
వంశము నశింపవచ్చు పాపంబునుండి
తొలగుమార్గంబు నాకేమి తోచనపుడు
యుద్ధమొనరింపకుంటయే యుత్తమంబు, 32

గీ. అదియటుండగ నచ్యుతా! అని యొనర్ప
కులమునశియించు కులపరంపరగవచ్చు
శాశ్వతాచారములుచెడు సత్యమిదియు.
అటు సనాతనధర్మంబు లన్ని చెడగ
పాపకర్మంబులకు పాల్పడుకులంబు. 33

గీ. పాపకర్మంబులెల్లెడ ప్రాకగానె
కులటలగుదురు కులమందు గరితలెల్ల
గరితచెడగానె వర్ణసంకరమునగుట
తథ్యమచ్యుత మరియది మిథ్యగాదు. 34

గీ. వర్ణసంకరదోషంబు వంశనాశ
కులకెగాకుండ సంకరకులజులకును

నరకకారణమైనదో మురవిరోధి
మరికులఘ్నుల పితరులుధరణియందు
శ్రాద్ధపిండోదకక్రియల్ సన్నగిల్ల
ద్రోయబడుచుందురు నరకాన ధ్రువముకృష్ణ. 35

గీ. ఈ కులఘ్నుల దోషంబులిందు గూడ
వర్ణసంకర కారణ వస్తువులయి
శాశ్వతములైన కులధర్మజాతి ధర్మ
ముల వినాశంబుగావించు ముఖ్యముగను. 36

గీ. కులముధర్మంబు చెడినట్టి కుజనులకును
శాశ్వతంబైన నరకవా సంబుశిక్ష
యనుచు పెద్దలుచెప్పిన యాప్తవాక్య
మరసితిమిగాదె శ్రీకృష్ణ! యది మరచితె. 37

గీ. రాజ్యలోభంబుచేగాదె రణమొనర్చి
బంధువధమునకిటనిట్లు పాల్పడితిమి
యఖిలధర్మంబులెరిగిన యార్యులమయి
యెట్టి దారుణమిటదల పెట్టినాము. 38

గీ. ఏ ప్రతీకారవాంఛ నా కిందులేక
యస్త్రవర్జితుడనగు నన్నాహవమున
శస్త్రధరులగు కౌరవుల్ చంపిరేని

అదియొకందుకు మేలె నాకగునిజంబు
బంధుహంతుకుడగాకుందు పరిధనమందు." 39

సంజయుడు చెప్పుచున్నాడు.

గీ. "అర్జునుడు దెల్పియట్టులు నార్తిగుంది
శరముదొడ్డిన చాపమున్ శరధినల్లి
స్యందనంబునబడవైచి చతికిలబడె
ఘనవిషాదంబు తనమదిగ్రమ్ముకొనగ." 40

మొదటి అధ్యాయం సమాప్తం.



# భగవద్గీత

## ( రెండవ అధ్యాయము )

# సాంఖ్య యోగము

సంజయుడు చెప్పుచున్నాడు.

గీ. "బంధుప్రేమకువశ్యుడై పార్థుడప్పు
డశ్రుపూర్ణాకులేక్షణు డగుచు మరియు
నస్త్రవర్జితుడై యట్టు లరదమందు
కూలబడగానె కృష్ణుండు మేలుకొల్ప
నాత్మకర్తవ్యమును దెల్ప నతనికనియె." 41

కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు.

గీ. "కాపురుషు డొందదగిన ఈ కశ్మలంబు
విషమసమయాన నీకేల? వినుము వేగ
అపయశస్కర మస్వర్గ్యమద్దిగాన
యార్యుడగునీకుదగదోయి యర్జునయది. 42

గీ. వలదు క్లైబ్యంబు వలదోయి పార్థనీకు
భ్రాంతిమంతంబుగాన పరంతపయిక
పామరునిదైన హృదయదౌర్బల్యముడిగి
లెమ్ము అర్జునా విల్లును నమ్ములగొని". 43

అర్జునుడు పల్కుచున్నాడు.

గీ. "ఓ యరిందమ యెట్టులీ యుద్ధమందు
పరమపూజ్యుని, భీష్ముని, గురునిద్రోణు
బూల పూజింపదగినట్టి పూరుషులను
వాడిబాణంబులను వైచి వసుధగూల్తు. 44

గీ. అర్థమునుగోరుగురువుల ననివధించి
అస్రదిగ్ధంబుభోగంబు ననుభవించి
యపయశంబును బడసియుల్లాడుకంటె
పూజ్యభీష్ముని, ద్రోణుని, బొరిగొనకయె
బిచ్చమెత్తుకుబ్రతుకుటే హెచ్చగునది. 45

గీ. ఆహవంబున విజయమో, అపజయంబో
ఎవరుగెల్తురో యోటమి యెవరిదగునో
నిర్ణయించుట కష్టమనిశ్చిత మది!
కాన కలహించుటో, మరి మానుకొనుటో
ధర్మమెద్దియో, మరియు నధర్మమేదో,
నిర్ణయింపంగ లేకుంటి నీరజాక్ష. 46

గీ. కృపణభావోప హతుడనై కృష్ణనేను
అరయకుంటిని పాపపుణ్యములతీరు
ఏదిపథ్యంబో, నాకిట నేది శుభమొ
యెఱుగజెప్పుముగురుదేవ యిపుడునీకు
శరణుజొచ్చితిశిష్యుడ చరణమంటి. 47

గీ. సమరవిజయంబు తెచ్చు రాజ్యంబుగాని
కదనమునజచ్చు వీరస్వర్గంబుగాని
ఇంద్రియములకు సంతృప్తి నిడగలేవు
అట్టియింద్రియ దాహంబు న పనయించు
నట్టిదెద్దియొ నాకిప్పుడానతిమ్ము". 48

సంజయుడు చెప్పుచున్నాడు.

గీ. "బంధువులజంపు టెట్లని పరితపించి
యాత్మకర్తవ్యమెట్టిదో యరయకుండ
నాత్మగురునకు కృష్ణున కట్టులనుచు
అర్జునుండుండెనూరక యరదమందు. 49

గీ. ఓయి ధృతరాష్ట్ర! అర్జునుండు భయసైన్య
ములకు మధ్యంబుననుండి ముప్పిరిగొను
దుఃఖభారంబుననుదూలి దురపలంగ
పరిహసించుచుకష్ణుండు పలికెనిట్లు". 50

కృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు.

గీ. "ఏడ్వదగనట్టివారికై ఏడ్చికూడ
ప్రాజ్ఞునట్టులుపల్కెదే పార్థనీవు
దేహధారులుగానున్న దేహులకయి
దేహమునశించిపోయిన దేహికొరకు
నేడ్వఁ డెందురు పండితులెఱుకచేత. 51

గీ. ఇప్పుడుంటిని, యపుడుంటి, నెపుడునుందు
నట్లెనీవును, అపుడిప్పుడనకయుంటి,
వీమహారాజులునునుండ్రి యెపుడునిట్లె
దేహము నశింప లోని విదేహులైన
ప్రాణులుందురు శాశ్వత బ్రహ్మమటులు. 52

గీ. దేహియేరీతిపొందు నీ దేహమందు
వరుసకౌమారయౌవన వార్ధకముల
నట్లె దేహాంతరప్రాప్తి నందు దేహి;
దీని తెలిసినధీరుడ దీనుడగును. 53

గీ. పంచతన్మాత్ర విషయులం పటమువలన
భువినిశీతోష్ణసుఖ దుఃఖ ములుజనించి
అప్పటప్పటికవిదోచి అడుగుచుండు;
దేహసంబంధులవిశుని తెలిసికొనుచు
ఆత్మమాత్రగనిల్పి ని రాకరించి
వాని సహియించవగావలె పార్థనీవు. 54

గీ. సుఖము దుఃఖంబు సమముగాజూచునట్టి
ధీరవరులను బాధింప నేరవవ్వి
అట్టి సుఖదుఃఖ సమభావమందువాడె
మోక్షమునుబొందసర్హుడు ముఖ్యముగను. 55

గీ. ప్రకృతివికృతులు జడధర్మపరములగుట
స్వస్వరూపంబులవికావు ప్రాణములకు
ఆజడంబులై తమరూపమైనప్రాణు
లింద్రియజ్ఞాన విషయంబులెరుగలేవు
కంటబడనట్టిజడమును కానియట్టి
భావజంబగునక్షర బ్రహ్మమొకటె
స్వస్వరూపము ప్రాణికిశాశ్వతముగ
భావమగుదేహిదేహము భావముగును
సత్తుగావునజీవుండు శాశ్వతుండు
శాశ్వతముగాదు దేహమసత్తుగాన. 56

గీ. అహమహమ్మను వాక్యలక్ష్యంబునాత్మ
అఖిలజీవులదేహంబు లందునుండి
విశ్వమయముగ వ్యాపించివిస్తరిల్లు
నా పరబ్రహ్మతత్త్వమే యక్షరంబు. 57

గీ. అప్రమేయమునవి నాశియైనయాత్మ
కాశ్రయములగునన్ని దేహములుగూడ
నంతవంతంబులనిచెప్పి రాత్మవిదులు
కాన యుద్ధంబుచేయుగా గడుగుమోయి. 58

గీ. ఎవ్వడాత్మనుహంతగా నెరిగికొనునొ
ఎవ్వడాత్మనుహతునిగా నెంచుకొనునొ
ఇరువురిర్వురు ఆత్మనునెరుగలేరు;

చంపబడదద్దిఎవరిని చంపదద్ది. 59

గీ. అక్షిగోచర సర్వదేహముల యందు
లోన బయటను విశ్వంబు లోననిండి
అజము నిత్యము శాశ్వత మైనదాత్మ
ఆదిపురాణము సృష్టికి నాదియద్ది
అది నశింపదు దేహంబు లంతమందు. 60

గీ. ఆత్మయవినాశియు వ్యయ మజమటంచు
నెరుగువిజ్ఞానియెవ్వని నింకజంపు
చంపుమనియాజ్ఞ యెవనికో సంగగలుగు
నాత్మరూపమెతాను గానై నయపుడు. 61

గీ. జీర్ణవస్త్రంబులబరిత్య జించివెన్క
నవ్యవస్త్రంబులను దాల్చు నరునిపోల్కి
శిథిలదేహంబులను విస ర్జించియాత్మ
క్రొత్త దేహంబులనుదాల్చి కొమరుమిగులు. 62

గీ. ఆత్మదహియింప బడనిది అగ్నిచేత
బాణహతిచేత నరుకంగబడనిదద్ది
తడుపబడనిది శీతలోదకముచేత
వాయుశోషణ మిసుమంతబడినదద్ది. 63

గీ. అట్టులచ్ఛేద్యమ క్లేద్య మైనయాత్మ
అనలదగ్ధంబునవిల శో ష్యంబుగాక

సర్వగతమగునిశ్చల స్థాణువగుచు
నచలముగనుండి నిత్యమనాదియగును
అని యెఱుంగుము అర్జునా యాత్మయనగ. 64

గీ. అట్టి యవిచింత్యము వ్యక్తమవికలముగు
నాత్మ నెఱిగియు నర్జునా యనుతపింప
నర్హుడవుగావు నీవని యరసిగూడ
అంత మే లేనిదానికై వంతపేల ?. 65

గీ. ఘటమునందలి గగనంబు ఘటమువగుల
విశ్వగోళావకాశాన విడిసినట్లు
దేహమునశింప నందలి దేహికూడ
నక్షరుండగు బ్రహ్మంబునందు జేరి
యతనిసంకల్ప మాత్రాన నవనిమీద
పుట్టి పెరుగుచుమరి మరి గిట్టుచుండు
వ్యక్తులేవీరలగుటచే వ్యధకు తావు
గలగకున్నదియర్జునా తెలిసికొనము. 66

గీ. పుట్టియున్నదిఎప్పుడైన గిట్టునుమరి
గిట్టునదికూడ తిరిగిమరి పుట్టుచుండు
చావుపుట్టుకలాత్మకు లేవెఱుంగు
దేహమొక్కటె నశియించి తిరిగిపుట్టు. 67

గీ. భూతములపూర్వరూపాలు పోల్చబడవు
వానిపరరూపములు గూడ గానబడవు
ఒక్కమధ్యస్థరూపమే యుర్విమీద
గానబడుచుండు నేఁటికి కలవిధాన. 68

గీ. అట్లు పూర్వాపరాకృతు లెరయబడక
మధ్యనాకృతిగన్నది మాయయగును;
ఆదిశూన్యము మరియు నంత్యశూన్య
మైన స్వప్నంబు సత్యంబుగానిదగుట
స్వప్నగతమృత్యువుఁ కేడ్వజనదుపార్థ. 69

గీ. అబ్బురంబుగగను నొక్కఁ డాత్మనుమరి
అద్భుతంబనిపలు కొక్కఁ డాత్మఁగూర్చి
వింతయైనదియాత్మ ని వినునొకండు
కనిన, పలికిన, వినిన, యీ ఘనులుమువ్వ
రాత్మతత్వంబునెరుగని యట్టివారె
అది యెఱుంగుటకష్టమో యమలచరిత. 70

గీ. జగతిలోనున్న జంగమ స్థావరముల
యఖిలదేహంబులందున్న యాత్మనిత్య
మరియువధ్యము శాశ్వతమైనదద్ది
భగ్నభాండంబులందలి బయలులెల్ల
యా మహాకాశమున యందె యడిగనట్లు

జీవుకోటుల దేహముల్ జీర్ణమైన
వానియాత్మలు చేరునా పరమునొకని;
అవి నశింపక మరల నుద్భవమునందు
నట్టి యాకృతి కేడ్చుట యనుచితంబు. 71

గీ. ఆత్మచింత సమటులుంచి యాదిభౌతి
కము గ యోచించినను కూడ సమరమొకటె
స్వకులధర్మంబు నీకిది భద్రమగును
క్షత్రియోచిత ధర్మంబు శత్రువధము
అది యొనర్చుటకీవింత యడలు దేల ? 72

గీ. అప్రయత్నంబుగా లభ్యమైనయిట్టి
ధర్మయుద్ధంబు స్వర్గ ప్రదాయమగును
శత్రుమర్దనశీలురా క్షత్రియులకు
ఈ దృశంబగు నవకాశమెల్లరికిని
లభ్యపడనిది అర్జునా రాజముఖ్య. 73

గీ. స్వకులధర్మంబు మరచిన క్షత్రియుడవు
నీకు కర్తవ్యమిదియని నేననంగ
నదియొనర్పక నీవిట్టులడలు దేని
ధర్మవిచ్యుతి యపకీర్తి దక్కు నీకు
ప్రసఘము పొందెదవా పైన నదినిజంబు. 74

గీ. అట్టి నీదగునపకీర్తి యవధిగనక
శాశ్వతంబుగనుండును జగతిమీద
ముందుబుట్టెడువారికి ముచ్చటగను
గౌరవరుడనుస్థిరయశస్కునకు నీకు
చావుకంటెను హేయమై జగతిమిగులు. 75

గీ. ఏ మహారథులిపుడు నిన్నింతవరకు
గౌరవించిరోసమరాగ్రగణ్యుడవని
యట్టివారలదృష్టిలో నగుదుభీరు
విప్లండాలంబు చేయుట కొప్పవేని. 76

గీ. అరులుచులకనచేసి నిన్నాడుసుడులు
ఆనగరానివి మరియు నువినగరాని
చెట్టలగుచును ములుకులై చెవులజొచ్చు
వానిభరియించి తలయెత్తి బ్రతుకుకంటె
నధికమైనట్టిదుఃఖమీ అవనిలేదు. 77

గీ. ఆజిచచ్చిన స్వర్గంబు నందగలవు
అని జయించినవిజయివై అఖిలరాజ్య
భోగభాగ్యంబులను నీవు పొందగలవు
ఆహవజయాజయము లిటు లర్థదములు
ఉభయతారకమైనది యుద్ధమొకటె. 78

గీ. ద్వంద్వముల రెంటి నొకటిగా దలచినట్టి
యాహవజయంబు నోటమినరసినీవు
యుద్ధమొనరించినను గూడ యోధముఖ్య
అంటకుండునుకర్తృత్వమనునఘంబు
ఆత్మనిష్ఠవండగుటచే నమలచరిత. 79

గీ. తెలిపితినియాత్మ తత్వంబు తీరుతెన్ను
సాంఖ్య శాస్త్రోక్తమైనట్టి జ్ఞానమద్ది
యోగశాస్త్రార్థ నిశ్చయుగ్గడింతు
దానినెరిగినకర్మ బంధంబు లేదు. 80

గీ. కలుగదారంభ దోషంబు జ్ఞానగతికి
నడుమనద్దానిచేయ కవిడిచియున్న
ప్రత్యవాయముగలుగు రాకృత్యమునకు
అట్టి కర్మమున తిస్వల్పమైనయుదియె
తరణిసుమ్మది సంసారశరధిదాటు. 81

గీ. నిశ్చయాత్ముడు తనబుద్ధి నిలుపునొకట
నిలుకడుండదు బుద్ధియు నిశ్చితునకు
కామ్యకర్మములకును నిష్కామకర్మ
ములకునంతరమిది యని తెలియుమోయి. 82

గీ. గురుని యుపదేశమందని నరులుభువిని
వేదకర్మంబులే తమ విధులంటుంచు

మధువునాశించి అరిగెడు మధుపములటు
కామ్యకర్మంబు లనెవారు కడకొన ర్తి
ఉపనిషద్వాక్య హేతులను త్తరింప
గల్గియునుగూడ వీరలా కాంక్షతోడ. 83

గీ. ప్రకృతిజములైన త్రిగుణ పరిభావితములు
సత్వరాజ సతాయ సా చ్ఛాదితములు
వేదకర్మాళి జ్ఞాన విచ్ఛేదనములు
కాన గుణముల మూటికి లోనుగాక
ద్వంద్వముల వీడి నిర్ద్వంద్వ సత్వ
సద్గుణాశ్రియుడవు కమ్ము సవ్యసాచి. 84

గీ. అస్థిరములగు భోగభా గ్యములకొ అకు
వేదకర్మాళిపై మోజు విడిచిపెట్టి
స్వాకుల ధర్మజ్ఞుడవు మరి స స్వరూప
సంస్మృతుండవు గమ్మోయి సవ్యసాచి. 85

గీ. భవము నాశము స్థితి యను బంధములకు
హేతువులు వేదవిధులని యెరిగికూడ
వేదకర్మంబు లందలి ప్రియమును మరి
ఉపనిషద్వాక్యముల మీాది యప్రియమును
వదలినంతనె మూటికిన్ వశముగాక
అలరగలవోయి అర్జునా యవనిమీాద. 86

గీ. త్రియునగు నీట దప్పిక తీర్చుకొనక
స్వల్పమనుకొని చెలమల జలముమాని
కడలి జలముల ద్రావిన కలదె తృప్తి
ఉప్పునీటను కడ లెంత గొప్పదైన. 87

గీ. చావుపుట్టుకలనుబంధ చయముబాప
ఉపనిషత్తులుమాత్రమే యుపకరించు
కడలిబోలిన వేదోక్త కర్మములను
విడిచిపుచ్చుటనీకు ని వేకముగద. 88

గీ. గురువు లేనట్టియజ్ఞులౌ నరులొనర్చు
వేదకర్మమకర్మమే కాదుకర్మ;
గురునిశరణంబుపొందిన కోవిదుడవు,
శ్రవణయుక్తుండవునుమరి జ్ఞానివగుట
స్వస్వరూపంబె అక్షరబ్రహ్మమనచు
మననమొనరించు నధికార మునకు నీవు
అర్హుడవుసుమ్ము మరియు న కర్మములగు
వేదకర్మాళికధికారి వీవుకావు. 89

గీ. అట్టి బ్రహ్మత్వబుద్ధిని అర్జునమది
మనన మాత్రంబుగాఁజేసి మనసునిల్పి
దైహికములగు కులవృత్తి ధర్మములకు
కర్తమాత్రంబుగాకుండ కర్మసాక్షి
గా గనుఁడుటయొక్కటే యోగమందుర్రు. 90

గీ. కామితార్థంబుచేసెడి కర్మములవి
ఫలములాశింపకేచేయు పనులకంటె
హేయమైనవి తెలియుము హీనచరిత;
ఫలమునఫలంబులనుసమ భావమునను
గాంచునాతడుయోగిపుం గవుడుసుమ్ము
ఫలమునాశింపకృపణ స్వభావుడగును. 91

గీ. బుద్ధియోగంబునందిన పురుషుడెలమి
అవనివిడుచును పాప పుణ్యములఫలము;
జ్ఞానయోగంబునందుమ జ్ఞానికాక
కర్మకౌశలమొకటెయో గంబటండ్రు. 92

గీ. కర్మఫలముత్యజియింప గలుగుశక్తి
బుద్ధియోగికిమాత్రమే పుడమికలదు
భవమునాశముస్థిరయును ప్రకృతిగుణము
లతనినంటవు తెలియుమో అమలచరిత. 93

గీ. మోహలిప్తముగానట్టి బుద్ధియోగ
మందునీవుండియున్నట్టి మరునిముసమె
వినవలయుదానిగూర్చియు విన్నదాని
గూర్చినిర్వేదమునుమది గూర్పగలవు. 94

గీ వేదవిప్రతిపన్నమై నీదుబుద్ధి
నిశ్చలసమాధియందుండి యచలమైన

యప్పుడెయోగంబుసిద్ధించి యలరుదీవు
త్రిగుణబంధంబులనుభువి తెగిపడంగ". 95

అర్జునుడు అడుగుచున్నాడు.

గీ. "నిశ్చలంబగుబుద్ధితో నిలుకడగను
నిశ్చలసమాధిస్థితుడని నిర్ణయింప
నాతడెటువల్కునెటునడ యాడుచుండు
నెట్టులుపవిష్టుడగునయ్య యెఱుగఁజెప్పుమ." 96

కృష్ణుడు చెప్పుచున్నాడు.

గీ. "ఎవడుకోరికలెద నించుకేనిలేక
తానుతనలోనిఆత్మసం దర్శనమున
పంచకోశవిలక్షణ బ్రహ్మమటుల
భావనముచేసియానంద పడుచునుండు
నతడునిశ్చలబుద్ధియం చనగఁజెల్లు. 97

గీ. కష్టములువచ్చినంతనె కలతపడని
యిచ్చినసుఖంబులకుమది నుబ్బిపోని
భయముక్రోధంబురాగమున్ వదలివైచి
మనెడువాడుస్థితప్రజ్ఞు డనగబరగు. 98

గీ. విషయములయందునాసక్తి విడిచిపెట్టి
కష్టసుఖములనొకటిగా గాంచిమఱియు

ఖేదమోదములయెడన భేదభావు
డగుస్థితప్రజ్ఞ గలయాత డదినిజంబు. 99

గీ. అవయవంబులనాత్మ దేహంబునందె
ముడుచుకొనునట్టికమఠమున్ బోలియెవడు.
నింద్రియేచ్ఛలకెగబడు నింద్రియముల
ముడుచుకొనగల్గుచున్నట్టి పురుషవడు డే
యగుస్థితప్రజ్ఞ గలయట్టి యతడు భువిని. 100

గీ. ఇంద్రియంబులనరికట్టి నంతమాత్రి
విషయవాంఛలనెవ్వడు వీడలేడు;
అట్టిసామర్థ్యమన్నది యాత్మయందె
పరముదర్శించునతనికే పట్టుపడును
అట్టివాడుస్థితప్రజ్ఞు డనగబరగు. 101

గీ. ఎట్టిపండితునకునేని యింద్రియములు
నిగ్రహించినకొలటని నెత్తికెక్కి
కలతపెట్టెడునట్టివి బలముకలవి
శిష్టులనుగూడలెవెఱపెట్టి చెఱచునవ్వి. 102

గీ. ఇంద్రియవిజేతయొక్కడే యీజగాన
నన్నుధ్యానించియెల్లప్పు డున్నకతన
నిశ్చలసమాధిగతుడును నచలుడగును;
అతనిప్రజ్ఞకుప్రతిరూప మరయుబోము. 103

గీ. విషయములయందెమనసుంచు వేదకర్మ
డస్థిరుండగునిశ్చలు డతడుగాడు;
కోరికలవెంబడింబడి కుదుటపడక
క్రోధకామంబులకుచెడి కుమతియగును. 104

గీ. మోహమన్నదిక్రోధాన బుట్టుచుండు
మోహితుండునుమఱపున మునిగిపోవు
మఱపుచేతనుబుద్ధియు మందగించు
బుద్ధిలేనట్టియాతడు బూడిదగును. 105

గీ. ఆత్మవశపర్చుకొనియోగి యైనవాడు
రాగవిద్వేషములకుదూ రస్థుడగుచు
విషయములవెంబడించియు విముఖతగని
నిర్మలంబగుమనసుతో నిలిచియుండు. 106

గీ. అటులనిర్మలమానసుం డైనవాడు
సకలదుఃఖంబులునుని ట్టె సమసిపోవ
బుద్ధిస్థిరపడిలక్ష్యంబు బోధపడగ
శుద్ధమతియౌచుపరమహం సుండెయగును. 107

గీ. యోగిగాకున్నబుద్ధిలే కుండబోవు
బుద్ధిలేకున్నయాత్మయు బోధపడదు
కాదుశాంతుడునా త్మవి జ్ఞానిగాక
సౌఖ్యముండదునరునకు శాంతిలేక. 108

గీ. విషయవాంఛలవెన్నంటి వెడలుమనసు
నరునిప్రజ్ఞనుహరియించి నష్టపెట్టు;
నీటదేలినపడవన య్యేటిగాలి
తఱిమి పెడదారిఁబెట్టిన కరణిపార్థ. 109

గీ. ఇంద్రియంబులనరికట్టి యింద్రియార్థ
ములకుదాసుండుగానట్టి పురుషవరుని
బుద్ధినిలకడగానుండి పోవుగాన
నట్టివాడుస్థితప్రజ్ఞు డనగఁజెల్లు. 110

గీ. భూతచయములునిదు రపోవురాత్రి
సంయమీంద్రులు మేల్కొను సమయమగును;
బహ్మవిజ్ఞానినిద్రించు పగటివేళ
భూతచయములు మేల్కొను పూటయగును. 101

గీ. వసుధగలమట్టివాహినుల్ వచ్చిపడగ
స్వస్వరూపంబుమారని సంద్రమట్లు
యోగివరుడునుకోరిక లురలిరాగ;
మదిచలింపక శాంతితో మనుచునుండు. 112

గీ. ఎవడుకోరికత్యజియించి యింద్రియార్థ
ములకువశ్యుండుగాకను ముక్తువగుచు
నిర్మమతనిరహంకార నియతిగనునా
యతడెశాంతినిసౌఖ్యంబు నందుచుండు. 113

గీ. ఆత్మతత్వంబు నెఱిగిన యట్టియోగి
మోహమును జెందకుండు మమ్మందు నెప్పుడు
అంత్యకాలంబునందైన యాత్మతత్వ
మరయునాతండు మోక్షంబు నందగలడు. 114

రెండవ అధ్యాయము సమాప్తము.



# భగవద్గీత

## (మూడవ అధ్యాయము)

# కర్మయోగము

అర్జునుడు అడుగుచున్నాడు.

సీ. "జ్ఞానయోగంబుకర్మయోగంబుకంటె
మిన్నయగునేనియచ్యుతా నన్నునీవు
ఈభయంకరసమరంబు నిపుడుసేయ
నేలబలవంతపెట్టెదో ఎఱుగఁజెపుము. 115

సీ. జ్ఞానయోగము, కర్మయోగములలోన
శ్రేయదంబైనదెద్దియో చెప్పుమోయి;
అట్లుగాకుండ ఇదమిద్ధమనక నీవు
సంశయాత్మునిసేతువే జాలిలేక." 116

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

సీ. "జ్ఞానయోగముతగుసన్న్యాసులకని
కర్మయోగంబుసంసారి ధర్మమనియు
తెలిపియుంటినినిష్ఠలు ద్వివిధములని
పుడమిఁబుట్టినవారికి భూపవర్య! 117

సీ. అకృతకర్ముఁడుకర్మసన్న్యాసిగాడు
సన్న్యసించినమాత్రమో క్షేమంబురాదు;

నిశ్చయాత్మకుని శ్రేష్ఠ నిరతముండు
నిముసమూర్ఖకయుండడ నిశ్చితుండు;
సాత్వికము రాజసము తామసములనెడు
ప్రకృతిగుణములత్రివిధస్వభావులగుచు
పనులొనర్తురుప్రజతమ మనుగడలను. 118

గీ. కడకకర్మేంద్రియంబుల గట్టివైచి
మానసికముగవిషయాల లీనమైన
యాతడజ్ఞుండుకపటసన్యాసిగాఁడ
నగునటందురుఅర్జునా అఖిలజనులు. 119

గీ. జ్ఞానపంచేంద్రియములను స్వాంతమందు
నిగ్రహించుచు నిష్కామ నియతినుండి,
కడకకర్మేంద్రియములచే కర్మములను
చేయునాతడు భువిని ప్రసిద్ధుడగును. 120

గీ. కర్మసన్యాసికంటెను కర్మకుండే,
శ్రేష్ఠుడనబడు; కర్మంబుచేయకున్న
జీవయాత్రలు సాగవు జీవులకును
నిత్యవిధులను చేయుటే నియతియగును. 121

గీ. భగవదర్పిత కర్మముల్ జగతిమీద
బాధకంబులు గాకుండు ప్రజలకెపుడు;

సంగముక్తుండవై నీవు సవ్యసాచి
యజ్ఞయాగాదులొనరించు టవసరంబు. 122

గీ. ప్రజలసృష్టించియజ్ఞంబు వలనబ్రహ్మ
యజ్ఞమొనరింపుడని యిట్టులానతిచ్చె;
వంశవృద్ధికి, మరియు సంపదలకొరకు
ఇష్టములనందికొని తరి యించుకొరకు. 123

గీ. దేవతలగూర్చిభావించు జీవులెలమి
యర్హసంభావనంబుల నలరుచుండ్రు,
జీవకోటులనాడించు దేవతలును,
మానవులసేవలంగొని మహిమగండ్రు;
ఇరువురన్యోన్యమిట్లుభా వించుకొనుచు,
నాశ్రియాశ్రితభావులై యలరుచుండ్రు. 124

గీ. యజ్ఞభాగంబులనుగొని యమరవరులు
ప్రజలకిత్తురునతుయ భాగ్యములను
వారొసంగినభాగ్యంబు వారికిడక
తానెభోగించునాతడు తస్కరుడగు. 125

గీ. దేవతాయజ్ఞశేషమున్ దిన్నవాడు
అఘవిముక్తుడు, మఱియుపుణ్యాత్ముడగును;
తానుతనకోసమేవండి తానెతినుచు
దేవతలవిస్మరించెడి జీవుడెపుడు
పాపకూపానబడిపొందు నాపదలను. 126

గీ. ఐదువిధములుయజ్ఞంబు లవనిగలవు
పాపకల్మషక్షాళనో పాయములుగ,
అవివేకకర్తవ్యములగుగృ హస్థులకును
అనివెలుంగుముకౌంతేయ యమలచిత్త! 127

గీ. ప్రాణులన్నంబువలననే ప్రభవమందు,
వృష్టివలననెయన్నంబు సృష్టియగును,
యజ్ఞకర్మంబులొనరింప నగునువృష్టి
కర్మసంచయమనగ య జ్ఞమురెసుమ్ము. 128

గీ. బ్రహ్మమందుండిపుట్టెనా కర్మములును
అక్షరోద్భవమయ్యె నీ యజుడుసుమ్ము
సర్వగతమైనయీబ్రహ్మ శాశ్వతముగ
యజ్ఞకర్మప్రతిష్ఠిత మైవెలుంగు. 129

గీ. సృష్టికాద్యంబులైనయీ యిష్టులెలమి
ముక్తిమూలంబులగుచుండు భూతములకు;
అజునిసృష్టికినియ్యదే యాదితుదియు
వృత్తపరిధికిమూలమా బిందువట్లు. 130

గీ. కార్యకారణభూతచ క్రంబుదీని
ననుసరించుచునడవని యటివాడు,
పాపములుచేసివిషయ లం పటుడునగుచు,
వ్యర్థమైనట్టిబ్రతుకునే బ్రతుకచుండు. 131

గీ. కోరికలపోవ్రు మదిదగు లొక్కనగనీక
ఆత్మరతిచేత నేతృప్తి నందువాని
కక్క యుండదు కర్మంబు లాచరింప,
ఆత్మనిష్టునిశ్చితుం డగుటచేత. 132

గీ. అట్టియాతఁడు యిహలోక మందుకర్మ
ములనుఁజేసినఫలమేమి గలుగదుమరి
చేయకున్ననుతనికి చేటురాదు
అక్కయుండదుతనికి కన్యాశ్రయంబు, 133

గీ. ముక్తసంగుఁడవగుచునో పురుషసింహ
కర్మములు చేయునీకుమో క్షంబుగలుగు
ఫలముగోరకతమకర్మ ములనుచేసి
జగతిజనములుగనిరిమో క్షంబుపార్థ. 134

గీ. ముక్తసంగులుజనకాది భూమిపతులు
కర్మములు చేసిసిద్ధిని గాంచినారు;
ప్రజలకాదర్శమగునట్లు పార్థనీవు,
ఆచరింపుముకర్మాళి ననుదినంబు. 135

గీ. పెద్దలందరునడచిన విధముగానె,
పిన్నవారలుగూడను వెంబడింతురి;
లోకధర్మంబునిదిగాన లోకవంద్య
నరులకాదర్శముగనీవు నడువవలదె! 136

గీ. నాకుకర్తవ్యమేలేదు లోకమందు,
అదియునుంగాక నాకు నీయవనియందు,
పొందవలసినమఱియును పొందనియది
ఎద్దియునులేదు తెలియంగ నెక్కడైన
అట్టినేనునుకర్మంబు లాచరింతు;
జగతికాదర్శమునునిల్ప జనులకొఱకు. 137

గీ. నేనువిధులనుచేయక మానినపుడు
జనవినాశముగల్గును జాతులందు
సంకరముగల్గియువి యునుసమసిపోవు;
విలయహేతువునగుదునే విశ్వమునకు;
ఒరవడిని పెట్టుయోజన ట్లుండలేను. 138

గీ. అజ్ఞులునుగూడకర్మంబు లాచరింతుర
కామితార్థంబునిత్యంబు కడకతోడ,
జ్ఞానివగునీవులోకసంగ్రహముకొఱకు,
విహితకర్మంబుచేయుట విధియొనికు. 139

గీ. జ్ఞానియగువాడుకర్మసంగతముగల్గు
నట్టిమూఢులకాదర్శ మగుటకొఱకు,
కర్మవిముఖితవారికి గలుగకుండ
నాతడెంతటికర్మసన్యాసియైన
చేయవలెకర్మములనువిధాయకముగ. 140

గీ. సాత్త్వికము రాజసము తామసగుణములవి
కర్మములు చేయుటకు మూల కారణములు
మనుజుడజ్ఞాని నెంచక మదిదలంచు
సహము చేతను కర్తృత్వ మతనిదియని. 141

గీ. ఇట్టి గుణకర్మవిభజన మెరిగినట్టి,
తత్త్వవిదుడింద్రియంబులు తమతమవిష
యంబులకు దాస్యమొనరించు ననుచు తెలిసి
వానియెడగల్గుమమతను వదలివైచు. 142

గీ. త్రిగుణములచేత మోహితులగుజనంబు
సక్తులగుదురు కర్మాళి సలుపుటకును,
అట్టివారలయాసక్తి నడపకుండ,
వృద్ధిచేయుటవిజ్ఞుల విధియెసుమ్మ. 143

గీ. ఆర్తి చెందక మోహంబు నందబోక
ఫలమునాశింపకుండగా పార్థనీవు,
అఖిలమధ్యాత్మబుద్ధినా కర్పణముగ
యుద్ధమొనరింపవలెనో యియోధముఖ్య. 144

గీ. ఎవ్వరను సూయులై శ్రద్ధ నిట్టిమతము
నాచరింతురో యట్టి వారఖిలకర్మ
బంధబద్ధులుగాకుండ బ్రతికిచివర
మోక్షపదమును గాంతురో భూపవర్య! 145

గీ. ఎవరసూయనుశ్రద్ధలే కిట్టిమతము
నాచరింపకయుందురో యట్టివారు
బుద్ధిహీనతచెడిపోయి సిద్ధిగనక
పెక్కుజన్మంబులెత్తుచు నురుక్కుచుందురు. 146

గీ. జ్ఞానియునుగూడతనపూర్వ జన్మకర్మ
ఫలముచేనైనసంస్కార భావమునకు
తగినవిధులనుచేయుచు ధరఁదరించు.
జీవులెల్లరుకర్మస్వ భావులగుట
కర్మమొనరింపకుండుట కష్టతరము. 147

గీ. విషయములయందునింద్రియ వేధలైన
రాగవిద్వేషములురెండుధ రాతలాన
దారిగొట్టులయ్యు ల వారితములు
జ్ఞానమొక్కటెవానిని నాశకారి. 148

గీ. స్వీయధర్మంబు శ్రేయంబు హేయమైన
మహితమైనట్టిపరులధ ర్మంబుకంటె;
స్వకులధర్మంబునందలి చావుమేలు,
పరులధర్మాన భాగ్యజీ వనముకంటె." 149

అర్జునుడు అడుగుచున్నాడు.

గీ. "ఇష్టపడకున్న పాపభూ యిష్టమైన
కర్మములుచేయుచున్నారు కర్మతతులు

దేవిలుబ్ధులవారిటు దిక్కు లేక
చేయుచున్నారొ శ్రీకృష్ణ చెప్పరాదె." 150

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

గీ. "రాజసగుణంబుగుణముల రాజగుణము
అపరిమితమగు కామము అందుబుట్టె,
తనివిగననిదియుద్దిహు తాశనునటు,
ప్రథమశత్రువుగాదీని పరిగణింపు. 151

గీ. నిప్పుపొగచేతనెట్టులు గప్పఁబడునొ,
ముఱికిచేనెట్టులద్దంబు మూతవడునొ,
మావిపిండంబుగప్పిన మాదిరిగనె,
జ్ఞానమునుగప్పుకామంబు మానవులకు. 152

గీ. అనలమట్టులుతృప్తిని గననిదద్ది
అవధులెఱుగకయాశాశ లరుగునద్ది,
భంగపడినంతభగ్గున మండునద్ది,
కామమొక్కటెజ్ఞానమున్ గప్పగలదు. 153

గీ. కామముదయించుచోటులు గలవుమూడు,
చిత్తమని, యింద్రియములని, బుద్ధియనియు
కామమీమూఁటజ్ఞానమున్ గప్పివైచి
దేహధారులఁజేయుస మ్మోహితులను. 154

గీ. అందుచేతనెయర్జు నా యాదిలోనె
ఇంద్రియంబులనరి కట్టి యిప్పుడెవేగ
జ్ఞానశత్రువుకామమున్ సంహరించి
జ్ఞానసంపన్నుడవు గమ్ము సవ్యసాచి. 155

గీ. ఇంద్రియంబులకంటెను హెచ్చుమనసు,
మనసుకంటెనుబుద్ధియె ఘనమటండ్రు,
బుద్ధికంటెనుపరమాత్మ పొడవుగాన,
నట్టిపరమాత్మయీశ్వరు డనగబరగు. 156

గీ. బుద్ధిచేతనుపరమాత్మ బోధగాంచి
యాత్మచేతనుమనసును నాకపెట్టి
అజితశత్రువికామంబు నడచిపెట్టి,
శాంతిగనుమోయిఅర్జునా సవ్యసాచి." 157

మూడవ అధ్యాయము సమాప్తం.

# భగవద్గీత

## నాలుగవ అధ్యాయము

## (జ్ఞానయోగము)

(శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు)

గీ. "అవ్యయంబగు నీయోగ మర్కునకును
తెల్పితిని మున్ను కౌంతేయ తెల్లముగను
అర్కుడావలమనువున కనువదించె
మనువుతరువాతనిక్ష్వాకు మహీపునకనె. 158

గీ. అటు పరంపరాగతముగా నైనదాని
నరిగియున్నారు రాజర్షి వరులు గూడ
నట్టియోగంబు ప్రాచీన మగుట వలన
చెడి నశించెను శ్రోతలు చిక్కకమరి. 159

గీ. భావమును భక్తుడవు నీవు పార్థ నాకు,
గాన దెల్పితికర్మయోగంబు నీకు;
ఇదిపురాతనముత్తమ మిదిరహస్య
మని యెఱుంగుము నేనిపు వినిచినయది." 160

అర్జునుడు అనుచున్నాడు

గీ. "అర్కునకు తొల్లి చెప్పితి నంటినీవు,
దాని నమ్ముటయెట్టులి ద్ధరణిమీద

అర్జునకు వెక్కబుట్టిన యనుగుబావ
సృష్టికాదినిసీవిది చెప్పనెట్లు ?" 161

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

గీ. "ఎన్నొజన్మలనెత్తితి మీవు నేను
అట్టికడచినజన్మల గుట్టెఱుగుదు;
నీవెఱుంగవువానిని జీవుడవయి,
ఈరహస్యమువింతైన దీశ్వరేచ్ఛ. 162

గీ. అజుడనయ్యునుమరియు నే నవ్యయుడను,
సర్వభూతంబులకు నేనె శాసకుడను,
పోషకుండనుగూడనీ భూతములకు,
ఆత్మమాయనునుద్భవ మంది తేను. 163

గీ. పుడమిధర్మంబునశియించి పోయినపుడు
మరియధర్మంబుతలయెత్తి తిరుగునపుడు
ధర్మసంరక్షణార్థంబు ధరణిమీద
నుద్భవింతునుకౌంతేయ యుగయుగాన. 164

గీ. దుష్టశిక్షణమొనరింప, శిష్టులకును,
రక్షణముగూర్పయర్జునా రాజముఖ్య
ధర్మమునుపొందచేయుంగ ధరణిపైన
యుగయుగంబునమరిమరి యుద్భవింతు. 165

గీ. అట్టి నాదగు పుట్టుక గుట్టునెవడు
దివ్య మంచెంచి తత్త్వంబు తెలిసికొనునో
యతడు దేహాంతరంబున నందగలడు
జన్మ రాహిత్య మైనమోక్షమును పార్థ. 166

గీ. వీత రాగులు నిర్భయు వీరవరులు,
క్రోధ రహితులు మరియును కోవిదులును,
నన్ను నిరతంబు ధ్యానించు చున్నవారు
పూత చరితులు పెక్కురు భూమి గలరు;
పొందె దరువారు పార్థనన్ పూర్ణముగను. 167

గీ. ఎవ్వ రెవ్వరు నేరీతి నిచట నన్ను
భావ నముచేసి కొలుతురో వారివారి
నటుల గ్రహియించి తనుపుదు నను నయమున
వార లుంగూడ నాదారి బట్టుకొనుచు
వాశ్రి యింతురు పెడదారి నరుగకుండ. 168

గీ. కర్మ ఫలసిద్ధి కోరెదు కాములిల
భగవ దర్పిత కర్మాళి ప్రతిదినంబు
నాచ రించుచు ఫలసిద్ధి నందగలరు;
మనుజ లోకాని కయ్యదే మనుగడగుట. 169

గీ. కర్మ ములనెల్ల గుణవిభా గంబుచేసి
నాల్గువర్ణముల్ సృష్టించి నాడ నేను;

ఆవ్య వస్తకు కారణం బైననేను;
అవ్యయుండన కర్తను నగుచునుందు. 170

గీ. కర్మ మంటదు ననుమరి, కర్మఫలము
గూడ నంటదు, రెంటిని వీడియుందు;
అట్టి వానిగ నన్నెవ్వ డరయ గలడొ
అతని కింగూడ నారెండు నంట కుండు. 171

గీ. కర్మ ఫలబంధ ములులేని ఘనులు ఋషులు
కర్మ ములుచేసి తొల్లి మోక్షంబు గనిరి;
అట్టి పూర్వుల మార్గంబు ననుస రించి
కాంక్ష లేకుండ విధులకు గడగవలయు. 172

గీ. కర్మ మెద్దియొ కర్మంబు కానిదెదియొ
తెలివి గలవాడు సహితము తెలియకుమరి
అశుభ మూలము సంసార మందునుండి
యవలఁ బడజేయు కర్మగుహ్యంబుగాన
చెప్పు చుంటిని యద్దాని చేయుకెట్లొ. 173

గీ. కర్మ తత్త్వంబు మరియున కర్మతత్త్వ
మరయ దగినవి యెల్లర కవని మీద
కర్మ తత్త్వంబు దెలియుట కష్ట తరము
భవన ముద్రము లోబడు పరిజకపార్థ. 174

గీ. కర్మములయందు నెవ్వఁడ కర్మముగను
నాయకర్మము నందెవ్వ డరయు కర్మ
మట్టి వారలు యోగులై యవనిబరుగు,
సర్వ కర్మంబు లనుచేయుకర్ములుమరి. 175

గీ. జ్ఞాన వహ్నిని పరిశుద్ధ మైన వియుగు,
కామ రహితంబు లైనట్టి కర్మములను
ఆత్మ విదులైన వారలే యాచ రింతురి
అట్టి వారిని పండితు లందురిజనులు. 176

గీ. అనిశ తృప్తుండు మరియుని రాశ్రియుండు,
కర్మ ఫలసక్తు డేమిట గాని వాడు,
అఖిల కర్మంబు లనుజేయు చాత డున్న
నకృత కర్ముడె యనుచుందు రతని ప్రజలు. 177

గీ. కోరి కలుమాని చిత్తమున్ కుదటపఱచి
వస్తు సంగ్రిహ వాంఛను వదలి వైచి
దేహ కర్మంబు లనెచేయు దేహి నెపుడు
పాప కల్మష మంటదు పార్థ వినుము. 178

గీ. ద్వంద్వ ములయందు నెట్టిభే దంబు లేక
అప్రయత్నంబు గాలభ్య మైన దాని
స్వీక రించుచు తృప్తిని జెందు వాడు
కర్మ మునుచేసి దానికి కట్టు వడడు. 179

గీ. ఆశ లేనట్టి యాసక్తి యుడిగినట్టి
జ్ఞాన నిష్ఠిత మానసుం డైన యతడు,
సవన కర్మాళి నిత్యంబు సల్పుచున్న
నతని నంటక యవివేక మంతమందు. 180

ఆ. హోమ సాధనములు హోమాగ్నియుం గూడ
యాగ కర్త యమరి యాగ మెల్ల
బ్రహ్మ మంచు నెఱిగి బ్రహ్మసమాధిని
గాంచు నతడు ముక్తి గాంచ గలడు. 181

గీ. కర్మ యోగులు కొందఱు కర్మములను
దైవ పరముగఁ జేయుచు దనియు చుంద్రు,
యతులు కొందఱు క్రతురూప మైన యాత్మ
నాత్మ చేతనె బ్రహ్మాగ్ని యందు నునిచి
యాహుతులొనర్చి యాగంబు లాచరింత్రు. 182

గీ. నిగ్రహాగ్నికిఁ గొందఱు నింద్రియముల
నర్పణము చేసి యజ్ఞంబు లాచరింత్రు,
శబ్ద గంధాది విషయాల సంగ్రహించి
కొంద ఱింద్రియ వహ్నికి విందొనర్చి
శాంత చిత్తత నుందురు జగతిమీద. 183

గీ. కడకు సర్వేంద్రియంబుల కర్మములను
ప్రాణ కర్మంబు లనుగూడ పట్టు దలతో

యాత్మ సంయమ యోగాగ్ని యందు రక్తి
హోమ మొనరించు యోగులు భూమి గలరు. 184

గీ. ద్రవ్య యజ్ఞంబు లొనరించు ధనిక వరులు,
వరత పోనిష్ఠు లగుసాధు వర్తనులును,
యోగ యజ్ఞంబు లొనరించు త్యాగ ధనులు,
వేద యజ్ఞంబు లనుచేయు వేద విదులు,
జ్ఞాన యజ్ఞంబు సాధించు మౌని వరలు,
కఠిన నియమాలు పాటించు కర్మ తులును,
పలుర కంబుల యజ్ఞముల్ సలుపువారు,
గలరు భువిలోన కామనిష్కాములగుచు. 185

గీ. అటులె మరికొంద ఱున్నార లవనిమీద
ఊపి రాటను బిగబట్టి యుంచి మరియు
శ్వాస నిశ్వాస యజ్ఞంబు సల్పుచుందు
ప్రాణ ముంగొని విడిచియ పానమవల. 186

గీ. ప్రాణ వాయువు హోమ మపానమంద
పాన వాయువు హోమంబు ప్రాణమందు
శ్వాస నిశ్వాస గతులను మూసివైచి
ప్రణవ మంత్రంబు పఠియించువారు గలరు. 187

గీ. నియమి తాహార వ్రతులగు నయవిదులును,
ప్రాణ మనుప్రాణ మందు న పానమునన,

పాన మందును లయమొనర్చి శ్వాసమాని
యజ్ఞ ములుసల్పు వారలే యవని గలరు. 188

గీ. అవ్విధంబుగ నందఱు యజ్ఞ వేత్త
లగుచు యాగంబు లనుచేసి యఘవి ముక్తి
బడయ గలుగుచునున్నారు పుడమి యందు;
నీర హాస్యము నెఱుగుమో యింద్రతనయ 189

సీ. యజ్ఞ శేషంబు భుజియించు నట్టి యతడు
బడయ గల్గును శాశ్వత బ్రహ్మ పదము
యజ్ఞ మొనరింప కుండిన యట్టి యతడు
రెంటి కినిచెడ్డ రేవడు రీతి గాను
ఇహాప రంబులు లేకుండ యిటన శించు. 190

గీ. బహువిధ యజ్ఞంబు లిట్టులు బ్రహ్మమందు
పుట్టి యున్నవి పురుషుల పుణ్యమునకు
ప్రకృత మవియున్ని కర్మసం బంధములని
యెఱిగి ముక్తిని బడయుమో యింద్రతనయ. 191

గీ. సవన కర్మంబు లన్నియు జ్ఞానమందు
సమసి పోవుట చేతనే జ్ఞానయజ్ఞ
మఖిల ద్రవ్యాది యజ్ఞంబు లన్నిట నది
యులరు చున్నది శ్రేష్ఠమై యర్జునభువి. 19

గీ. తత్త్వదర్శుని దర్శించి దరికిఁజేరి,
పాదములనంటి సాష్టాంగ పడుచు మ్రొక్కి
సందియము దీర ప్రశ్నలు జడిగవైచి
వరవుడంబున మెప్పించి వానివలన
సదుపదేశంబు లవినుని జ్ఞానివగుము. 193

గీ. దేని తెలిసిన మోహమె ద్దానియందు
గలుగకుండునో, యదెవివే కంబుసుమ్ము
యఖిల భూతము లనుస్వాత్మ నరసినట్లె
యరయు దద్దాన నాయందు నఖిలజగతి. 194

గీ. పాపములు చేసి ఎంతటి పాపివైన
భయము చెందంగ పనిలేదు పార్థనీకు,
జ్ఞానమనునావ నప్పాప జలధినుండి
నిన్ను దరియింప గలుగును నిజము పార్థ. 195

గీ. సమిధ లెట్లగ్ని చేతభస్మంబులగునో,
సవన కర్మంబులవియున్ని సమిధలట్లె
వసిగ నగునోయి జ్ఞానాగ్ని మంటలకును
తథ్యమియ్యది కౌంతేయ ధర్మచరిత. 196

గీ. అతిప విత్రము పరిశుద్ధ మైనయట్టి
జ్ఞానమునుమించు వస్తువీ జగతిమీద

కాన బడనోయి, కర్మయోగంబువలన
కాలమరుగంగ జ్ఞానంబు కలుగునీకు. 197

గీ. శ్రద్ధ గలవాఁడు పరిపూర్ణ జ్ఞానిసుమ్ము
సంయ తేంద్రియుఁడునుగూడ జ్ఞానిసుమ్ము
జ్ఞాన వంతుండు శాంతినో క్షేములగనును;
అనియె యుంగుము అర్జునా, అమలచిత్త. 198

గీ. జ్ఞాన హీనుఁడు, శ్రద్ధయు లేనివాఁడు
సంశ యాత్మకుఁ డైనట్టి జనుఁడుగూడ,
నిహపర ంబులు లేకుండ, నిటనశించు
సత్య మిద్యుది కౌంతేయ సమరవిజయ. 199

గీ యోగ వశమునకర్మవి రాగియైన
జ్ఞాన వశమున ఛిన్నసం శయుఁడునైన
యాత్మ వంతున కెన్నఁడు నవనియందు
కర్మ బంధంబు లనునవి గలుగఁ బోవు. 200

గీ. అందుచేతను అర్జునా యాత్మలోని
జ్ఞాన హీనతఁ బుట్టిన సంశయమును
పార ద్రోలుము జ్ఞానాసిపట్టినీవు,
కర్మ యోగంబునకు లెమ్ము కడకతోడ. 201

నాలుగవ అధ్యాయము సమాప్తము.

## భగవద్గీత

### ఐదవ అధ్యాయము

### (కర్మసన్న్యాసయోగము)

అర్జునుడు అడుగుచున్నాడు.

గీ. "కర్మ సన్న్యాస మునుమరి కర్మయోగ
విషయ ములఁగూర్చి చెప్పగా వింటినయ్య;
అందు నెయ్యది శ్రేయమో యరయ లేక
సంశ యించుచు నుంటిని స్వాంతమందు
సంశ యముఁదీర్చి నన్నింక సాకుమోయి" 202

(శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు)

గీ. "కర్మ సన్న్యాస మునుమరి కర్మయోగ
ములును రెండును ప్రజలకీ భూమిమీద
క్షేమ కరములు నెంతయో శ్రేయదములు,
కర్మ సన్న్యాస మునకంటె కర్మయోగ
ముత్త మంబైన ధర్మమీయుర్వి ప్రజకు. 203

గీ. ద్వేష మునురాగ మునులేని ధీయుతులును
కాంక్ష నుజయించు నిష్కామ కర్మరతులును,
నిత్య సన్న్యాసు లనుమాట నిజముపార్థ;
అట్టి వారలు కర్మంబు లాచరింప
కర్మ బంధంబు లంటక గందురిముక్తి. 204

గీ. కర్మ యోగంబు జ్ఞానయోగములు రెండు
వేరు గావంద్రు విజ్ఞులు విమలమతులు;
అందు నెద్దాని చేసిన నందగలరు
రెంటి నించేసి నంతటి నిండుఫలము. 205

గీ. సాంఖ్య యోగులు నెట్టిమోక్షమునుగంద్రొ
కర్మ యోగులు నట్టిమోక్షమునుగంద్రు;
యోగములరెంటినొకటిగా నూహచేసి
యరయు వారలె సర్వజ్ఞులగుదురోయి. 206

గీ. కర్మములుచేయ కుండుట కష్టతరము
జ్ఞాన ధనులకు భువిగల్గు మానవులకు
కర్మ యోగాను సారులే కాంక్షదీర
కామితములను బొందిని ష్కాములగుచు
సన్యసింతురువిసిగివే సారిపోయి. 207

గీ. కర్మ ఫలసక్తు డెన్నడు గానివాడు,
ఆత్మ నుజయించి పరిశుద్ధు డైనవాడు,
యింద్రియవిజేత మరియునీ యిలనుగల్గు
భూత చయముల దనయాత్మ బోల్కగనెడు,
కర్మ తునకెందు బంధముల్ గలుగకుండు. 208

గీ. ఆత్మ విదుఁడగు నట్టియ ధ్యాత్మయోగి
నిత్యు డైనంది కములను నెరవుచున్న

నట్టి కర్మంబు లనుచేయు నట్టివాడె
కర్త గాకుండు నాయన్ని కర్మములకు. 209

గీ. ఇంద్రియంబులె తమతమ యిచ్ఛకొలది
శ్వాస, నిశ్వాస క్రియలను జరుపుకొనుచు
తినుచు తిరుగుచు పలుకుచు వినుచుగనుచు,
నున్న వనియెంచి కర్తృత్వ ముంచుకొనడు. 210

గీ. కాముకుడుగాక కర్మసంగంబువిడిచి
యీశ్వ రార్పిత కర్మంబు లిచ్ఛచేయు
నట్టి వానిని పాపంబు లంటకుండు,
జలజ పత్రంబు నంటని జలములటుల. 211

గీ. ఆత్మ పరిశుద్ధి కొరకుమ హాత్మవిదులు
మనసుచేవాక్కుచేతక ర్మములచేత
ఫలములందలి యాసక్తి వదలివైచి
యింద్రియంబుల చేతచే యుదురుపనులు. 212

గీ. కర్మఫలమునుత్యజియించి కర్మయోగి
యాత్మ నిష్ఠను సుఖశాంతు లందగలడు,
కర్మ ఫలమును గోరెడి కర్మఠుండు
తనివి దీరకకర్మబంధమునుగాంచు. 213

గీ. అరయనవరంధ్రయుతము దేహమ్మునందు
సన్య సించుచు జీవుడు సర్వకర్మ

ములను చేయక చేయించు మూలమవక
అతులమైనట్టిసుఖశాంతులందుచుండు. 214

గీ. కర్మకర్తృత్వకర్మసంగములురెండు
దైవ కల్పిత మైనవి కావుపార్థ
ప్రకృతిలోనున్నమాయప్రభావమునను
పుట్టి జీవుల బాధించు పుడమినవ్వి. 215

గీ. పాప కర్మంబు చేగల్గుపాపఫలము,
పుణ్యకర్మంబుచేగల్గుపుణ్యఫలము,
కర్మములుచేయుకర్త నేకడకుజేరు;
అపహరింపడుభగవంతుడాఫలమును
ప్రకృతి భవులైన ప్రజల రాబడులవి. 216

గీ. ఎవవియజ్ఞతయడగునోఎఱుకచేత
అట్టి ఆతని ఎఱుకయేఅర్కనిభము,
అదియె చూపించు చీకటి కవలనున్న
యాప రాత్పరుపరమాత్మ యైనవాని. 217

గీ. జ్ఞానమనునీటకడగియ జ్ఞానమెల్ల,
మనసుబుద్ధినియాపర మాత్మయందె
నిలిపిబ్రహ్మమెతానుగానెంచువాడు
పుట్టుకయెలేని పుణ్యుడై పుడమిబరగు. 218

గీ. వేద వేత్తను, వినయుడౌ విప్రవరుని,
కపిని, గజమును, మరిశున కంబునైన,
కుక్క మాంసము వండుకు మెక్కువాని,
పరమ ఛండాలు నింగూడ పండితుండు
ఒక్క రీతిగ సాకుచు నుండునెపుడు. 219

గీ. సర్వ సమభావ మూంచిన సజ్జనుండు
జన్మ రాహిత్య మునుగను జగతిమీద
తప్పు లరయని ఒప్పుల కుప్పకెపుడు
తోచు పరమాత్మయతడుని ర్దోషిగాన. 220

గీ. శుద్ధ చిత్తుడు స్థిరబుద్ధిసూన్నృతుడును,
ఆత్మ సంయోగమునపరమాత్మదెలిసి
మోద మందెడు సుఖమును పొందినపుడు,
ఖేద మందడు కష్టంబు మీదపడిన. 221

గీ. ఆత్మ గానట్లు విషయాభి లాష విడచి
ఆత్మ గానుండి సుఖియించు నట్టియతడు,
అవల పరమాత్మ యోగసం భవమువలన
నక్ష యంబగు సౌఖ్యంబు నందగలడు. 222

గీ. మొదలుతుదిగలయింద్రియో ద్భూతములివి
శోక హేతువు లగుటచే లోకమందు

జ్ఞాను లెవ్వరు నవ్వాని జాడఁబోరు;
సస్వ రూపాను సంధాన వశ్యులగుట. 223

గీ. క్రోధ కామంబు లనుబుట్టు రోగములకు
లొంగి పోవక పుడమిపై నుండగలుగు
యోగ యుక్తుఁడు సుఖశాంతి భాగధేయు
డని యెరుంగుము అర్జునా యవనియందు. 224

గీ. ఎవ్వ డాత్మనె సుఖియించి యంతరాత్మ
యందె క్రీడించి యలరునో యట్టియతడు
బొంది తోడనె స్వర్గంబు పొందగలడు;
బ్రహ్మ మగుచును పరమాత్మ వశ్యుడగుచు. 225

గీ. క్షీణ పాపుడు మరియును ఛిన్నసంశ
యుండు, నియతాత్మ చిత్తుడు, యోగివరుడు,
సర్వ భూతహితరతుండు, సదయమూర్తి
బొంది తోడనె స్వర్గంబు పొందగలడు. 226

గీ. క్రోధకాముకవృత్తివిరోధులైన
నియత చిత్తాత్ము లును మరి నిరతిశయులు
బ్రహ్మ నిర్వాణ పదమును బడయగలరు;
ఇహప రంబుల నర్జునా, యిందిరాతనయ. 227

గీ. జ్ఞాన శక్తులు దేహమ్ము లోన బయట
పుట్టుచుండిన వానిని నెట్టి ఎవడు
కనుబొమల మధ్య దృష్టినే కంబుచేసి
యూపిరినిపీల్చి విడుచుచును న్నవాడొ
యట్టియాతడె ముక్తికి నర్హుడుమరి. 228

గీ. ఇంద్రియమ్ముల నిర్జించి, యిచ్ఛవిడిచి,
భయము, కోపంబు మోహమున్ పారద్రోలి
మోక్షమునుకోరు చున్నట్టి పురుషుడెవడొ
అట్టి యాతడు మోక్షార్హుడగును సుమ్మ
దేహియైనను మరియువి దేహియైన. 229

గీ. యజ్ఞ భోక్తగ నన్నెవ్వ డరయుగలడొ
తపము ఫలముగ నెవడునన్ దలచుకొనునొ
అఖిల లోకేశ్వ రుడనని అనునదెవడొ
భూత ధాతను నేనని పోల్చునెవడొ
అట్టియాతడే మోక్షంబు నంద గలడు." 230

అయిదవ అధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## ఆరవ అధ్యాయము

## (ఆత్మ సంయమ యోగము)

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

గీ. "కర్మ ఫలమును గోరని కర్మరతుండు
అగును యోగియు మరియుసన్యాసి గూడ
అగ్ని వేల్పకసోమరి యైన వాడు
కాడు యోగియు సన్యాసిగూడ నవల. 231

గీ. ఏది సన్యాస మిదియని యెరిగినావొ,
అదియె యోగంబు గానీవు మదినెరుగుము
ఎవడు సంకల్ప ములుత్యజింపకుండ
కాడు యోగియు సన్యాసి గూడ కాడు. 232

గీ యోగు లగుటకు సాధనమూర్వి మీద
కర్మ కారణ మనెదరు కర్మవిదులు
కర్మ యోగులు శమయుతుల్ ఘనులసుమ్మ;
ఇదిరహస్యంబు గానెర్గు మిందరి తనయ. 233

గీ. సర్వ సంకల్ప రహితుడై జగతిమీద
ఇంద్రియార్థంబు లనుమది నేవగించు
నట్టి యాతడు యోగిగా నవనిబరగు;
ఇదిరహస్యంబు గానెర్గు మిందరి తనయ. 234

గీ. అడచుకొనకుండ ఆత్మను ఆత్మచేత
నుద్ధరింపంగ వలయునో యిద్ధచరిత;
ఆత్మ నుద్ధరించునదియా యాత్మ సుమ్ము
ఇదిర హాస్యంబుగా నెర్గుమిందఱి తనయ. 235

గీ. ఆత్మ యాత్మకు బంధువు నరియుఁ గూడ,
ఆత్మ వశపర్చుకొనువాని కదియె బంధు
వదియె శత్రువు వశముకా నట్టివాని
కిదిర హాస్యము తెలియుమో యిందఱి తనయ. 236

గీ. ఆత్మ నుజయించి శాంతంబు నందు నతడు
భువిని శీతోష్ణ సుఖదుఃఖ ములసహించు
ద్వంద్వ సంబంధి కాకుండ ధరణి నిలిచి
లోను గాకుండు మానావ మాన ములకు. 237

గీ. అనుభ వించును పరమాత్మ నాత్మ లోనె
జ్ఞాన విజ్ఞాన తృప్తాత్ముఁ డైన జనుడు
దివ్య కూటస్థు డునువిజి తేంద్రి యుడును
యుక్తు డనబడు చుండునీ యుర్వియందు;
అట్టి యోగికి యవనిపై మట్టి పెల్ల
కాంచ నముఁరాయి ఒకటిగా కానిపించు. 238

గీ. సాధు వులయందు, మధ్యస్థ సహృద యులను,
సఖుల యందున, నేగాక శత్రు లందు,

అహితు లందున, హితులందు నాప్తులందు,
పాపు లందున మరియున పాపులందు,
సర్వ సమబుద్ధి కలిగిన జనుడొకండె
యుత్తమోత్తమ యోగిగా నుర్విబరగు. 239

గీ. యోగి యొక్కడె ఏకాకి గాగనుండు
నిర్జ నాటవి యందాత్మ నిగ్రహుడుగ;
దేని గోనకుండ, దేనికి లోను గాక
ఆత్మ సంయమదీక్షితు డగుచునుండు. 240

గీ. మిట్ట పల్లంబు గానట్టి యట్టిచోట
సముచి తంబైన పరిశుద్ధ సమత లమున
నాస నముచేసి దర్భల నజినములను
పరచి వరుసగ నాపైని వస్త్ర ముంచి
సుస్థి రంబుగ పీఠంబు సిద్ధ పరచి; 241

గీ. నియత చిత్తేంద్రి యుండుగ, నిష్క్రియుడుగ
మనసు నేకాగ్ర మునవిల్పి మసలకుండ
నందె గూర్చుండి యోగంబు నభ్య సించు.
నాత్మ శుద్ధికి పరమాత్మ యగుట కొరకు; 242

గీ. శిరము గ్రీవంబు వెన్నును స్థిరము గాగ
నూర్ధ్వ గతినెత్తి నిక్కించి యుంచి మరియు

కంటి దృష్టిని నాసికాగ్రమున నిల్పి
ప్రక్క గనకుండ గనుచునా ముక్కుకొననె; 243

గీ. పరమ శాంతత మరియుని ర్భయముతోడ
బ్రహ్మ చర్యంబు నిష్ఠతో బడసి యవల
మనసు నిర్జించి బ్రహ్మాస మాధినందు
పురుషు డొక్కడె సున్న్యాసం పూర్ణయోగి. 244

గీ. నియత మానస చిత్తుడై నిత్య మిట్లు
యోగ సంసిద్ధి నందుచు నుండుకతన
అష్ట దాశ్రిను ముత్కృష్ట మైన మోక్ష
పదము నందుచు శాంతిని బడయు నతడు. 245

గీ. తిండి పోతులు మరియును తిండి లేక
ఎండి మాడుచు నుపవాస ముండు వారు,
రేయిమేల్కని నిద్దుర లేనివారు,
రేబవళ్ళనువిడకని ద్రించువారు,
యోగ సిద్ధులు కాలేరు యోధముఖ్య. 246

గీ. తగుప్రమాణంబుగ భుజియించి తగినరీతి
పండి శయనించి మేల్కని యుండు వారు,
యుచిత విధులను చేయుచు నుండువారు,
యోగు లగుదురు దుఃఖవియోగు లగుచు. 247

గీ. చిత్తమునులోఁగ దీయుచు స్థిరముగాఁగ
ఆత్మ యందున నిల్పెడి నట్టివాఁడు,
కామితంబులు (శ్రీఘ్ర)మే కరగి పోవ
యోగ యుక్తతి నాత్మగా నుండి పోవు. 248

గీ. వాయు చలనంబు లేని ని వాతదీప
కళిక యట్లులు నిలుకడ గాఁగనుండు;
ధ్యాన మగ్నుని యోగీంద్రు మానసంబు
చిత్త చాంచల్య రహితమై స్థిరత గాంచు. 249

గీ. స్థిరత కూర్చున్న యోగికి చిత్తశాంతి
ఎచట లభియించు చున్నదో యచటె మరియు
ఆత్మ పరమాత్మ దర్శించు నట్టి దగుచు
నవ్య యానంద మునునాత్మ కందచేయు. 250

గీ. బుద్ధి సిద్ధము పరిశుద్ధ బోధ మగు
నింద్రియంబుల కంద క తీంద్రియమగు
పరమ సుఖలబ్ధి బడసిన పరమయోగి,
యచల శిఖరాగ్ర మునఁపీడ డచలుడతడు. 251

గీ. దేని పొందిన తరువాత వానికింక
పొంద దగినది లేదని బోధ పడునో.
యట్టి స్థితినున్న యతనిదుః ఖార్తిగూడ
చలన మందఁప లేదని శ్చలుడుగాన. 252

గీ. అట్టి యోగంబె దుఃఖంబు నెట్టివైచు
సుస్వ భావంబు గల్గిన సువ్రితమది
విసుగు చెందని మనసుతో విధిగదాని
చేయ వలయును నిశ్చిత చిత్తబుద్ధి. 253

గీ. అఖిల సంకల్ప జనితంబు లైనయట్టి
సర్వ కామ్యాభి రతిమది సంహరించి
మనసు చేనింద్రి యగ్రామ మునుజయించి
విషయ లంపట మునుదాను విడిచిపుచ్చి. 254

గీ. ధైర్య మునపూంచి బుద్ధితో తత్వమెఱిగి
మెల్లమెల్లగ శాంతించి మేలుకొనుచు,
నాత్మ సంయమ యోగాన నన్యచింత
మాను కొనుమోయి యర్జునా మానివగుచు. 255

గీ. మర్కటమువలె చంచల మైనమనసు,
ఒక్క చోటను స్థిరముగా నుండదెపుడు;
విషయ ములయందు నాసక్తి విడిచినట్లె
యాత్మ చేతను మనసును నడచిపెట్టి
యోగ నిష్ఠను గూర్చుండి యుండవలయు. 256

గీ. యోగి యట్టులు గూర్చుండి యుండుకొలది
మనసు చంచల తత్వంబు మరినశించి,

రాజసము చచ్చి విషయవిరాగి యగుచు,
బ్రహ్మ భావంబు నతడప్డు బడయుగలడు;
అట్టి పరమాత్మ భావంబు నందుయోగి
పొందు నవ్యయ సౌఖ్యంబు పుడమిమీద 257

గీ. అట్లు నిత్యంబు యోగస్థుడై నయోగి
దోష మెల్లను క్రమముగా తొలగిపోవ
అశ్రమంబున నత్యంత మమితమైన
బ్రహ్మ సాయుజ్య సౌఖ్యంబు బడయుగలడు. 258

గీ. అఖిల భూతంబు లొకటిగా నరయుగలుగు,
యోగ యుక్తుండు గాంచుతా నొకనియందె
యఖిల భూతంబు లున్నట్లు; అతడుగూడ
నఖిల భూతాలనున్నట్టు లరసికొనును. 259

గీ. అఖిల భూతంబు లందున న్నరయు వాడు
నఖిల మునుగాంచు నాయందు. నల్లెయతడు;
అట్టి వానికి నేనులే నట్టుకాదు;
అతడు నాకును నిత్యమై నట్టివాడె. 260

గీ. అన్నిభూతంబు లందున్న నన్ను దెలిసి,
ఒక్కడనునన్ను సేవించు చున్న యోగి,
పలువిధంబుల పనిపాట్లు నెఱపుచున్న
ననిశముండును నాయందె యతడుసుమ్ము. 261

గీ. అఖిల భూతంబులందలి యాత్మయొకటె
యన్న సత్యంబు నెఱిగియా యన్నిటిదగు
సుఖము దుఃఖంబు నొకటిగాఁ జూచుయోగి
యోగు లందున నుత్తమ యోగియగును. 262

అర్జునుడు అడుగుచున్నాడు.

గీ. సర్వసమభావ యోగంబు సల్పుమనుచు,
చెప్పి యుంటివి శ్రీకృష్ణ యొప్పిదముగ
నట్టి యోగంబు సల్పుట కలవియగునె
చపల చిత్తుడ నగునట్టి జనుడనగుట. 263

గీ. మనసు చంచల మైనది మర్కటమటు,
కట్టి యుంచుట కష్టంబు పట్టువడదు;
గాలి వంటిది నిలువదు గానఁబడదు;
కలత వెట్టును నద్దాని కట్టుటెట్లు?" 264

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు

గీ. "ఔను అర్జునా! కష్టమే యదినిజంబు;
మనసు నిలుకడ కుదురదు మానవులకు;
అట్టి చిత్తంబు వైరాగ్య మభ్యసింప
నిశ్చలంబుగ నుండును నిశ్చయమిది. 265

గీ. వశ్య చిత్తుడు గాలేని వాడెవండు
యోగి కాలేడు యెన్నడీ యుర్విమీద

మనసు వశపర్చు కొనునట్టి మానవుండు
యోగవంతుడు కాగల డోయిసఖుడ. 266

అర్జునుడు అడుగుచున్నాడు.

గీ. "శ్రద్ధ మాత్రిలుగానుండి శక్తిలేక
మనసు వశపర్చు కొనలేని మనుజులందు,
యోగ యుక్తుడు గానట్టి యువకుడవల
నేమి యగుచున్న వాడొనా కెఱుగఁజెప్పుము. 267

గీ. ఓమహాబాహు శ్రీకృష్ణ యీమహోర్వి
యోగి కాలేని మూఢుడు నుఱకచెడునె?
బ్రహ్మ సాయుజ్యమార్గంబు బడయకుండ
నిహాపరంబుల రెంటికి నితడుగాక; 268

గీ. శ్వసన హతిదూలు ఘనఘనా శకలమట్లు
రెంటి కినిచెడ్డ రేవడు రీతిగాను
వాన గురియకశిథిలమై వట్టిదగునొ
యనెడు సంశయ చిత్తుడన గుచునుంటి. 269

గీ. ఇట్టి నాదగు సంశయ మిచటదీర్ప
నీవొ కండవె తగుదువు నీరజాక్ష!
అన్యు లెవ్వరి కిద్దిసా ధ్యంబుగాదు
సంది యముదీర్చి సఖునను సాకుమోయి." 270

## శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

గీ. "నష్టి గాదెప్పు యోగవిభ్రష్టుడోయి
ఇహపరంబుల మరియిక నెందు కూడ
సుకృత మునుబట్టి కనుచుండు శుభములెలమి;
చెందకుండగ దుర్గతి నెందుగూడ. 271

గీ. పుణ్యవంతుల లోకముల్ పొందివాడు
బహుళ వర్షంబు లచటని వాసముండి
మరల పుట్టును భువిని శ్రీమంతునింట
పుణ్యకర్మంబులను చేయు పుణ్యజనుల. 272

గీ. అట్లు గాదేని బుద్ధిచే నధికుడైన
యోగి పుంగవు నింటిలో నుద్భవించు
నట్టి పుట్టువు దుర్లభ మందు రెల్లరని
అనియె యెఱుంగుము అర్జునా యమలచిత్త. 273

గీ. యోగులకులంబు లందున నుద్భవించి
పూర్వ జన్మంబు నందలి పుణ్యవశత
నధిక మైనట్టి యత్నంబు నతడు చేసి
యోగ సంసిద్ధు డగునోయి యోధముఖ్య. 274

గీ. పూర్వ యోగానుభవమున్న పుణ్యుడగుట
యోగ సంసిద్ధి నేకోరి యున్నకతన
అతడు వేదోక్త ధర్మంబు లాచరించు
వానికంటెను నధికుడై వసుధబరగు. 275

గీ. అటుల జన్మాంతరముదైన యనుభవమున
కృషియొ నర్చుచు నతఁడుత రించుటొక్క
జన్మలోఁగాక మరుసటి జన్మమునను,
కల్మషములెల్ల పోఁద్రోసి నిర్మలుఁడయి
పరమ పదమును గాంచును పార్థవినుము. 276

గీ. తాపసులకంటె విజ్ఞాన ధనులకంటె
వసుధ కర్మంబు లనుచేయు వానికంటె
యోగి యెక్కుడై యధికుఁడై యుండుగాన
యోగి వగుమోయి యర్జునా యోధముఖ్య. 277

గీ. అట్టి యోగుల నన్నెవ్వ డాత్మయందు
సతము ధ్యానించి పరవశ స్వాంతుడగుచు
నాత్మ సంయమ యోగంబు నందగలఁడొ
అట్టి యోగియె యోగులందధికుఁడగును. 278

ఆరవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## పదవ అధ్యాయము

## (విజ్ఞానయోగము)

గీ. కర్మ ఫలమును గోరక కర్మములను
నాని మిత్తము చేసెడి నరవరుండు,
తెలియ బడనట్టి నన్నెట్లు లెరిగికొనునొ
యట్టి జ్ఞానంబు బోధింతు నమలచిత్త. 279

గీ. నేను విజ్ఞాన యుతమైన జ్ఞానమెల్ల
బోధ పఱతును కౌంతేయ బోధకునిగ
దాని దెలిసిన నీకింక ధరణిమీద
నెఱుక పడనిది లేకుండు నింద్రతనయ. 280

గీ. దీని వేయింట నొక్కడే తెలియగలడు
అట్టి యాతడె యద్దాని నాశ్రయించు,
నాశ్రయించెడి వారల యందుగూడ
వేయి కొక్కని కేనేను విదితమగుదు;
అదియు నాదయు చేతనే యాతడెరుగు. 281

గీ. ప్రకృతు లున్నవి నాకుస్వా భావికములు
పంచ భూతంబు లేగాక పరమమైన
బుద్ధ్య హంకార చిత్తసం బోధకములు
అష్ట విధములు నపరంబు లవ్విసుమ్ము. 282

గీ. ఇవియె గాకుండ ననితర మింకయొకటి
పరమ మైనది యుత్తమ ప్రకృతిమరియు,
ప్రాణ దాయిని కలదుప్ర పంచమునకు
భూత సృష్టికి కారణ భూతిమగుచు
నదియు నాదైన ప్రకృతియే యగునుసుమ్ము. 283

గీ. ఈవ రాపర ప్రకృతులే హేతువులుగ
నఖిల భూతంబు లునుబుట్టి యడగుచుండు;
నట్టి సృష్టికి మరియుసం హారమునకు
కారణుడనేను యితరులు కారెవరును. 284

గీ. నేను గాకుండ నితరంబు లేనె లేదు;
మరియు నాయందె దారాన మణులఁబోలె
యీజగంబులు హారంబు నోజ మెరయఁ
గూర్చ బడెనోయి యర్జునా కూరిమిగనె. 285

గీ. నీటి యందలి రసమును నేనెయగుదు,
సూర్య చంద్రుల కాంతిని సుమ్మునేను,
ప్రణవ మగుదును సుమ్మునే ప్రాచమువుల
గగన మందలి శబ్దంబు నగుదునోయి
నరుని పౌరుష మేనౌదు నరవరేణ్య! 286

గీ. పృథ్వి గంధంబు నేనౌదు విధిగ, మరియు
నగ్ని వేడిని **వాడిని** అర్జునభువి

నఖిల ప్రాణుల కాయువు నగుచు పార్థ
తపసి వరులకు తపసౌదు తప్పకుండ. 287

గీ. భూత చయమెల్ల నాయందె పుట్టుచుండు,
నేస నాతన పురుషుండ నీజగతికి,
బుద్ధి మంతుల యందలి బుద్ధి నేను
కాంతి మంతంబు లగువాని కాంతి నేను. 288

గీ. కామమును, రాగమునుదొఱియు ఘనబలమును,
ధర్మ బాహ్యంబు కానట్టి ధరణిభూత
చయము లాశించు కామంబు సత్యమేనె;
యనియె ఱుంగుము అర్జునా యమలచిత్త. 289

గీ. సత్వ జనితంబు లైనట్టి శమదమములు,
జగతి రాజస జన్యమౌ శక్తియహము,
మూఢ తామస జనితముల్ మోహశోక
గుణము లన్నియు బుట్టునా కుండినుండి;
వశము గాకుండు వానికె వ్వటికి నేను,
యవియె వశపడి యుండునా కనిశమవియు
నెఱుగు మర్జున యదియెన న్నెఱుకపఱచు. 290

గీ. సత్వ రాజస తామస జన్యములగు
షడ్గుణంబుల మగ్నులై జగతిజనుడు,
షడ్గుణాతీతు నవ్యయు సత్యమునను,
తెలిసి కొనలేడు 'మాయ' యన్ మరుగునబడి. 291

గీ. దైవ సంబంధియును, గుణ త్రయమువలన
గలుగు మాయనుదాటశక్యంబుగాదు;
దాట గల్గిన వారలు ధరణిమీద
నన్ను శరణన్న వారలే నరవరేణ్యా! 292

గీ. పాప కర్ములు మూఢులు పరమనీచు
లైనవారలుననుశర ణనగలేరు;
మాయ లోబడి యజ్ఞత మానవతను
దలప కుండిన వారలు దనుజులగుట. 293

గీ. ఆర్తి గలవాడు, జిజ్ఞాసు వైనవాడు,
అర్థ మునుగోరు వాడును, నాత్మవిదుడు
ననెడు నల్వురె భక్తి నన్నాశ్రయింత్రు;
అట్టివారలె సుకృతులీ యువనిమీద. 294

గీ. అట్టి భక్తులు నల్వురి యందుగూడ
నిత్య యుక్తుడు, జ్ఞానియు, సత్యమెరిగి
యితర మెఱుగక యొకడన న్నేకభక్తి
నాశ్రయించెడు నతడునా కధికుడగును,
అతని కేనును ప్రియతముం డగుదుగూడ. 295

గీ. వారు నల్వురు భక్తులు దారులెమరి
అందు జ్ఞానిని నేనుగా నగుదునోయి;
జ్ఞాన యోగియె నిశ్చల మానసమున

నన్నె గతిగాగ నమ్మియు న్నందువలన
యాత డొక్కడె ననుబొందు నర్హుడుమరి, 296

గీ. జన్మ జన్మకు గల్గిన జ్ఞానముననుు,
సర్వ మునునిండు నన్నెర్గి శరణుజొచ్చి
పొంద గల్గిన యాతడే పుణ్యుడిలను;
అట్టి పుణ్యులు అరుదెయీ యవనియందు. 297

గీ. విషయ వాంఛల వెంటాడి వేగిరపడి
యపహృ తజ్ఞాన వంతులై యట్టిదైవ
ములనె పూజించి ఫలములఁ బొందువారు,
నట్టి దైవంబులనెచేరి యలరుచుంద్రు. 298

గీ. ఎట్టి యాశను వెంటాడి యెట్టిదైవ
పూజ లొనరింపవలెనను బుద్ధిగలదొ
అట్టి బుద్ధిని శ్రద్ధవా రందునట్లు
చేయువాడను నేనె ప్రసిద్ధమిద్ది 29౯

గీ. నేనొసంగిన శ్రద్ధతో నియతుడగుచు
నట్టి దేవత నేయాత డాశ్రయించు;
నట్టి దేవత రూపాన నతనికేను
వాంఛి తార్థము లిచ్చెద వాంఛదీర. 300

గీ. అన్య దేవత లనుగొల్చు నల్పబుద్ధి
యట్టి దేవత నేచేరు నదినిజంబు
అంత వంతంబె యాతడు నందుఫలము
శాశ్వ తముగాదు నేనిచ్చు సత్ఫలనుటు
ముక్తు లగుదురు నాదగు భక్తులెల్ల
నాశరహితమునయ్యాదే శాశ్వతమును. 301

గీ. అవ్యయంబున నుత్తమ మైనదైన
నాదు పరరూప మెవ్వరు అరయలేరు
జ్ఞాన హీనులె వ్యక్తుండ గానినన్ను
వ్యక్తి గానెంచి పూజించి రక్తినుంద్రు. 302

గీ. అంద ఱికినేను నగపడ నదినిజంబు
కనుల కగపడ మాయచే గప్పబడుట
అజుడ నైనట్టి యవ్యము డైననన్ను
మనుజు డెవ్వడు దెలియడా మాయవలన. 303

గీ. పూర్వ మెప్పుడో పుట్టిన భూతములను,
పుట్టఁ బోవుచు నునట్టి భూతములను,
పుట్టి జీవించు చున్నట్టి భూతములను,
అన్ని టినిగూడ నెర్గుదు నవనిమీద,
యెఱుగ డొక్కడు ననుమాత్ర మిలమరింక. 304

గీ. కామ విద్వేష ములఁబుట్టికవలలైన
మోహ శోకంబు లకుసర్వ భూతములను
పుట్టినప్పుడే వశపడి పుడమఁబడియె
నదియె యజ్ఞాన తిమిరమై యవనినిండె. 305

గీ. పుణ్య కర్మంబు లను చేయు పుణ్యులుభువి
తాము చేసిన పాపంబు తరగిపోవ
ద్వంద్వ కారణమోహముస్ వారువిడిచి
నిశ్చలములగు నియమాల నిశ్చలునను
రిక్తి సేవించు చున్నారు రాజముఖ్య ! 306

గీ. జరయు మరణాంబు లేనిమో క్షంబుకొఱకు
నాశ్రయించుచునన్నువ్వ గనుగగలరొ
అట్టివారలె బ్రహ్మఁబునాత్మనెర్గి
అఖిల కర్మంబులను గూడ నరయుగలరు. 307

గీ. అవని యధిభూత మధిదేవ మగుటెకాక
యందు నధియజ్ఞ మునుగూడ నగుదుననుచు
నరయు నాతడె నన్నెప్డు మరువలేడు
మరణ మునగాని మరిభువి మనుచుగాని. 308

ఏడవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## ఎనిమిదవ యధ్యాయము

### (అక్షర పరబ్రహ్మ యోగము)

అర్జునుడు అడుగుచున్నాడు.

గీ. "ఏది బ్రహ్మము, అధ్యాత్మమేది కృష్ణ !
యేది కర్మంబు నధిభూత మేదిమఱియు,
నేది యధిదైవ మధియజ్ఞుడెవడొ చెప్పుము;
యాతడెట్లుండునియు తాత్ములైనవారు
మరణకాలాన నిన్నెట్లు మరువకుండ
దెలియగలుగుదురో నాకు దెలుపుముసఖ !" 309

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు

గీ. పరము మును, అక్షరంబును బ్రహ్మమగును,
అతని భావమె యధ్యాత్మ మనగబడును,
భూత భావోద్భవమునకు పూనిచేయు
సర్గ మొక్కటే కర్మసంజ్ఞనుబరంగు. 310

గీ. నాశ మగునది యధిభూత మీశరీర
మందు నధిదైవ ముండుజీ వాత్మయగుచు;
అట్టి దేహుని నన్నధియజ్ఞుడంద్రు
అదియె తత్వంబు నాయది యమలచిత్త. 311

గీ. అంత్యకాలాన నధిదైవ, మాత్మయనుచు
కాయ మునువీడు నట్టియా కాయజుండు,
పొందు నన్నింక సందేహ మిందు లేదు
దీనినర్థము కౌంతేయ జ్ఞానమిదియె. 312

గీ. ఎవ్వ డేభావ మునతన యెదభజించి,
యాత్మ దేహంబు విడుచునో యట్టివాడు
అవల నా భావ మునెపొంది యలరఁగలఁడు;
అద్ద మందున తనరూప మరసినటుల. 313

గీ. అందు చేతను అర్జునా యనిశమునను
తలచు కొనుచును చేయుము ధర్మమీవు;
ఇట్లు నీమనో బుద్ధుల ర్పించుకతన
అవల పొందంగ గలవునన్న దినిజంబు. 314

గీ. అట్టు లలవాటు పడినయా యాత్మయోగి,
ఇతర చింతలఁ బోవని యెదవహించి,
పరమ పురుషుని నన్నెప్పు దలచుకతన
పొందు నన్నోయి సందేహ మిందు లేదు. 315

గీ. రవియె ఉంగని వెలిఁగిన కవినినన్ను
అతిపు రాతన పురుషుడ నైననన్ను
ఈజగంబును శాసించు నీశునన్ను,
అణువు కంటెను నతిసూక్ష్మ మైననన్ను,

అఖిల మునకును ధాతగా నైననన్ను,
ఊహ కందని రూపాన నున్ననన్ను
సూర్యనిభునన్ను, చీకటి సూడునన్ను,
మదిద లంచుచు నన్నెప్పు వదలకుండు
నట్టి యాతడు నను బొందు నదినిజంబు. 316

గీ. మరణ మాసన్న మగునట్టి తరుణమందు
నిటల మందున శ్వాసను నిలిపియుంచి,
నిశ్చ లంబగు మనసుతో నిరతమొవడు
పరమ పురుషుని గొలుచునో భక్తితోడ
నట్టి యాతడె పరమాత్మ నందగలడు. 317

గీ. అక్ష రంబని వేదంబు లనిన దేదొ,
వీత రాగులు యతులవి విడుదు లేవొ,
బ్రహ్మచారులు గోరెడి పదము దేదొ,
అట్టి పదమది మోక్షమే యగునటంచు
సంగ్రహంబుగ జెప్పెద నర్జునమరి. 318

గీ. కాయ మందలి రంధ్రముల్ గప్పికొనుచు
మనసు నిలుకడ గానుంచి మసలనీక
యూపిరూర్ధ్వంబు గానెత్తి యుంచితలను
యోగధారణ చేయుచు నున్నవాడు,
పరమగతిపొందు చున్నాడు పార్థవినుము. 319

గీ. ప్రణవ మోంకార సుస్వర పఠనమందు
నన్నె స్మరియించు కొనుచు తా నున్నయపుడు
దేహ ముత్యజించి పోయిన దేహియొకడె
మోక్ష మునుబొందు చున్నాడు ముఖ్యముగను. 320

గీ. ఇతర చింతలు లేకయే యెల్లపుడును
నిత్యయుక్తుఁడు గానుండి నిశ్చలుడయి
యోగధారణ చేసెడి యోగికేను
సులభముగలభ్య మగుదును కౌరవర్య ! 321

గీ. అట్లు ముక్తిని మోక్షంబు నందునరులు
పుడమి బుద్బుద ప్రాయులై పుట్టఁబోరు;
పుట్టుకలు లేని పరమాత్మ బోలివారు
బ్రహ్మ పదమంది శాశ్వత త్వమునుగంద్రు. 322

గీ. బ్రహ్మ లోకంబు వఱకున్న బహుళములగు
లోక వాసులు ప్రాణిసు శ్లోకులెల్ల
మరల బుట్టుచు నుందురీ ధరణిమీద;
నన్ను నోంకార వాచ్యగా సన్నుతించి
పొంద గల్గిన యాతడే పుట్టబోడు. 323

గీ. యుగస హస్రంబు చననొక పగలుగాను
వేయి యుగములు చననది రేయిగాను
బ్రహ్మ దేవున కగునొక్క పగలు రేయి
యనియె ఱుగుదు రవనిపై నఖిలప్రజలు. 324

గీ. బ్రహ్మదేవుని వగలుప్రారంభమందె,
పుట్టు నుజగంబు లవ్యక్త పూర్ణునుండి;
అతని రాతిరి ప్రారంభ మైనయపుడు
అడగు నయ్యవి బ్రహ్మంబు నందెమరల. 325

గీ. బ్రహ్మ వగలున భూతముల్ ప్రభవమంది
అతని రేయిని యయ్యవి యడగినట్లె
చావుపుట్టుకలునుగూడ జగతిలోని
భూత చయములు మరిమరి పొందుచుండు. 326

గీ. అట్టి బ్రహ్మంబు కంటెను నవ్యమైన
లక్షణంబులు గలయట్టి లక్షణుండు
దృశ్యమానుడుగాక యదృశ్యుడుగను,
నాశరహితుండుగాజగ దీశుడుగను,
మిగిలి యశేదుండునాశంబు జగములవగ. 327

గీ. అక్షరుండును నవ్యక్తుడైనవాడె,
ముక్తి నొసగెడు వాడని యుత్తముడని,
శ్రుతులు చెప్పుచు నున్నవి స్తుతులొనర్చి,
అట్టివాడను, నాపద మందునట్టి
భూత మెయ్యది భువిమరి పుట్టబోదు. 328

గీ. భూత చయములు యెవ్వని బొజ్జగలవో.
యఖిల జగతిని వ్యాపించు నాతడెవడో,

యట్టి యాత్మని భక్తిన నన్య చింతఁ
బొంద సులభముసర్వమౌ భూతములకు. 329

గీ. ఎపుడు చచ్చిన యోగులీ యిలనుమరల
పుట్టి పెరుగుచు నుందురో యట్టివేళ,
యెపుడు చచ్చిన యోగులీ యిలమరింక
పుట్ట కుండగ ముక్తులౌ నట్టివేళ,
లెఱిగి వేళావి శేషంబు లెఱుకపఱతు
వినగ వలెనోయి అర్జునా విధిగవాని. 330

గీ. శుక్ల పక్షంబు నందున సూర్యుడెలమి
నుత్త రాయణ గతుడుగా నుండివెలుగు
పగటి పూటను ప్రాణముల్ వదలువార
లట్టి మార్గంబు గాపోయి యందగలరు
శాశ్వతబ్రహ్మపదమునో సవ్యసాచి. 331

గీ. రాత్రిపూటను, చీకటి రాత్రిలందు
దక్షిణాయనగతుడుగా తరణియైన
యారుమాసంబు లందున హతుడునైన
యోగి పుట్టును మరలనీ యుర్విమీద. 332

గీ. శుక్లపక్షము మరికృష్ణ పక్షమనియు
సూర్యచంద్రుల గతులను చూపునట్టి

యయన ములు రెండు వత్సరమైనయట్లు
పక్ష ములు రెండు నెలనెల వచ్చుచుండు;
పుట్టబోవకు వెలుగులో గిట్టువాడు,
పుట్టుచుండును చీకటిన్ గిట్టువాడు. 333

గీ. ఇట్టి గతులను రెండింటి నెఱిగినట్టి
యోగి మోహింపఁబడకవి రాగియగును;
అందుచేతనుఅర్జునా యనిశమీవు,
యోగయుక్తుడవగుమోయి యుత్తమునిగ. 334

గీ. వేద ములయందు యజ్ఞయా గాదులందు
దాన ములయందు తాపసధర్మమందు
శాస్త్ర మెయ్యది ఫలమని చాటినదియో.
యట్టిఫలమును మించిన యట్టిఫలము
యోగి పొందును యియ్యదే యోగమహిమ. 335

ఎనిమిదవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## తొమ్మిదవ యధ్యాయము

### (రాజవిద్యా - రాజగుహ్య యోగము)

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు

గీ. గుహ్యతమమైన గుహ్యమున్ గురునిభాతి
దర్శనము చేసి వచియింతు దానివినుము;
జ్ఞాన విజ్ఞాన యుతమున ద్దానివలన
యశుభ మెయ్యది నిన్నెప్డు డంటకుండు. 336

గీ. విద్య లనునెల్ల రాజైన విద్యయిద్ది,
గుప్తవిద్యలనదిగొప్ప గురునివిద్య
అతిపవిత్రము నుత్తమ మైనదద్ది
ధర్మ యుక్తము సుఖఫల దాయియగుచు,
కూసు విద్యగ నున్నద భ్యాసులకది. 337

గీ. నేను చెప్పెడి యీమహా జ్ఞానమందు,
శ్రద్ధ లేనట్టి యాతడు శాశ్వతునను,
చేర కుండును నేనెంత చేరువైన,
జననమరణంబు లున్నసం సారమందు
మునిగి తేలుచు మరిమరి బుట్టుచుండు. 338

గీ. ఇంద్రియాతీత మగునాయదృశ్యమూర్తి
సర్వమునునిండి యున్నదీ జగమునందు,

భూత సృష్టికి నదిమూల భూతమగుచు,
వాని పై మాత్రి మాధార పడక యదియు,
నవియు దానికివిడివడి యవలనుండు;
నంటి యుంటని యవ్యక్త మగుచుపార్థ! 339

గీ. ఇదియె నాదగు సామర్థ్య మిదియెఱుగుము,
ఆత్మ పరమాత్మ సంయోగ మనగనిదియె,
అంటి పెట్టుకు నదియుండి యుంటకుండు
నఖిల మునకది హేతువు నయ్యుగూడ,
హేతు వదికాదు పరముని శ్రేతుకంబు. 340

గీ. గగన మందున బుట్టిన గాలియెట్లు
జగము లెల్లెడ విహరించి గగనమందె
లీనమైనట్లు నాదగు లీలబుట్టి
లీనమగుచుండు నాలోనె లీలగాగ. 341

గీ. ప్రళయ కాలాన నాదగు ప్రకృతియందు
భూత చయమెల్ల లయమును బొందుచుండు;
సృష్టి కారంభమైననా యిష్టివలన
పుట్టునటుసేతుమరలనా భూతములను. 342

గీ. ప్రకృతి వశమగు భూతప్ర పంచకమును
సృష్టి గావింతు నాదగు యిచ్ఛచేత
వశుడ గాకుండ నేనట్టి ప్రకృతికెపుడు
స్వీయ మాయాబ లంబను చేష్టవనల. 343

గీ. అట్టి నాదగు సృష్టికార్యమునగాని,
యవల నద్దాని ధారణమందుగాని
లయము నర్చెడి ప్రళయకార్యమునగాని
కర్త గాకుండ నుందుఁ దటస్థముగను
కావు నాకవి మరి బంధకములుగూడ. 344

గీ. అస్మదాజ్ఞకు లోఁబడి యాత్మప్రకృతి
సకల భూతంబు లనుసృష్టి సల్పుచుండు;
నాధిపత్యము నాయదే యఖిలమునకు;
నస్మదాజ్ఞనె యవినిల్చి యడఁగుచుండు. 345

గీ. దేహధారుఁడనగునన్ను దేవదేవు
గాఁ దలంపక మూఢులు కావరమున
పరిహసించుచు నున్నారు పార్థ నన్ను;
నరుల యందున నేనును నరుఁడనైయుని
కలసి మెలఁగుచు నేనున్న కారణమున. 346

గీ. అట్టి మూఢుల బుద్ధినాయందుపడక
కోరి కలవెంట పరువిడు; వారునటులె
వ్యర్థ యత్నము సేతుర నర్థమునకు
మాన వాదర్శమును మాని దానవులయి;
దైవమునకును వ్యతిరేక భావులగుచు
చెడి నశింతురు అజ్ఞులై పుడమి ప్రజలు. 347

గీ. మఱిమహాత్ములు దైవీయ మైనప్రకృతి
నాశ్రయించుచు నున్నట్టి యాత్మవిదులు
భూత సృష్టికి కారణ భూతుడనని
నాశ రహితుడ ననియులో కేశుడనని,
నన్నె యెఱుంగుచు భజియించు చున్నవారు; 348

గీ. మేటి మార్గానువర్తులై మెలగుకతన
నన్ను మాత్రమె కీర్తించి నన్నె తలచి,
నిత్య యత్నంబులొనరించి నిశ్చలమగు
భక్తిఁ బూజింతురనుయోగ యుక్తులగుచు. 349

గీ. జ్ఞాను లగువార లితరులు జగతిమీద
నన్ను నేకేశ్వరుఁడనంచు నెన్నుకొనియొ,
సూర్యనక్షత్రచంద్రుల సొబగునున్న
స్వప్రకాశుడ నేనని స్వాంతమలర
విశ్వమునునిండు ననుగొల్తు విభునిగాఁగ. 350

గీ. నేన క్రతువును యజ్ఞమున్ నేనెయగుదు,
స్వధను నేనౌదు మరియునౌ షధమునేన,
మంత్రమునునేన యాజ్యంబు మరియునేనె,
హోమ సంబార ములునగ్ని హోత్రమాది
యజ్ఞ పరికరంబులు నేనె యర్జునమరి. 351

గీ. తల్లిదండ్రియునేనెయీ ధరణికిమరి
ధాత నగుదును మరివాని తాతనగుదు;

ప్రణవ మోంకార మను నేనె భద్రముగను
ఋగ్య జుస్సామ వేదసం స్కృతుడ నేను. 352

గీ. నేనె గతినౌదు, భర్తను నేనెయగుదు,
నేనె ప్రభువును, సాక్షిని నేనెయగుదు,
జగతి కావాసమును నేనె శరణమగుట;
మేలు గోరెడు వాడను జాలిచెంది,
పుట్టు కకుగాని మరియవి గిట్టుటకును
హేతు వగుదును నేనధి భూతములకు
నక్షరంబగు బీజమై యఖిలమునకు. 353

గీ. ఆతపముగూర్తు మింటనే నర్కుడనయి
మేఘ మగుదును వర్షించి మేదినిపయి
వఱపుగల్పింతు వర్షంబు గుఱియకుండ
అమృత మనుగాక మృత్యువు నగుదుగూడ,
సత్తసత్తును నేనౌదు సవ్యసాచి. 354

గీ. ఋగ్య జుస్సామ వేదంబు లభ్యసించి
సోమ పానంబు గావించి శుద్ధులగుచు,
పూత పాపులు గానైన పుణ్యజనులు
సవన ములుచేసి సాధింతు స్వర్గతులను,
అట్టి వారలు మరణంబు నందియవల
స్వర్గ మునుజేరి యందలి సౌఖ్యములను,
అనుభ వింతురు నున్నారు అని యెరుగుము. 355

గీ. స్వర్గలోకాన సుఖులైన వారుగూడ,
తాము చేసిన పుణ్యంబు తరగిపోవ,
మరల జన్మింత్రు మనుజులై మహిని పార్థ;
అట్టి వేదోక్త ధర్మంబు నాశ్రయించి
కోరి కలుదీర్చుకొని యెడు వారు మాత్ర
మవని బుట్టుచు చచ్చెదరంతెకాని
పుట్టుకయె లేని మోక్షంబు పొందలేరు. 356

గీ. ఇతర చింతలు లేకతదేకచింత
నన్ను మాత్రమె ధ్యానించుచున్న వారి
మంచి చెడ్డలు నేఁమాతు: మరియువారి
సర్వ భారంబు నాయదే సవ్యసాచి. 357

గీ. ఇతర దైవంబు లనుగూర్చి యెవ్వరెవరు
భక్తి పూజలు సేతురో వారుగూడ
నెఱుగ కుండగ ననుభజి యించువారె
యగుచు నున్నారు అర్జునా యనియెరుగుము. 358

గీ. అఖిల యజ్ఞంబు లకుభోక్త నగుదు నేను
ప్రభుఁడ నగుదును సర్వప్రపంచమునకు;
నన్యదైవంబు లనుగొల్చు నట్టివారు
ఈ యదార్థంబు నెఱుగక యీ జగాన
పుట్టువులగాంచి మరణంబు పొందుచుండ్రి. 359

గీ. దేవతలపూజ గావించి దేవతలను,
పితరు లనుపూజ గావించి పెద్దవారి,
భూత తతిఁబూజ గావించి భూతములను
నన్ను పూజించి భక్తితో నన్నుఁ బొంది;
యులరు చున్నారు మనుజులీ యవనిమీద. 360

గీ. భక్తితో నిచ్చు నొకచిన్ని పత్రమైన
పూజ లోనుంచు నరవిరి మొగ్గనైన
అర్ఘ్య ముగనిచ్చు జలముది యల్పమైన
నేను గ్రహియింతు నిచ్ఛతో వానినుండి. 361

గీ. కాన కౌంతేయ నీచేయు కార్యములను
నాని మిత్తమె చేయుము, ననుగ్రహించి
ఆక లికిదిని నట్టియూ యున్నమైన,
దాన ముగనిచ్చు నట్టిసి ధనమునైన,
నాహు తిగచేయు నట్టియూ హవిసునైన,
తపన పడిచేయు నట్టిసి తపమునైన
నాకు నర్పించి చేయుము లోకవంద్య. 362

గీ. భోజ నముచేసి తనువుము భోగశయను,
దాన ముగనిమ్ము ధనముని ధానుదనుప
అగ్ని డనుపంగ నాహుతి కాజ్యమిడుము,

తపము చేయుము ఆత్మకుతపనమాన్ప,
అదియె ముక్తికి మార్గము అమలచిత్త. 363

గీ. ఎట్టి కర్మంబు లకునీవు కట్టువడక
అటుసు భాశుభ ఫలంబు లైనకర్మ
ములను చేసిన మోక్షంబు గలుగునీకు
నన్ను గూడను బొందెద వెన్నికగని. 364

గీ. సముడ నౌదును సర్వభూ తముల కేను
ద్వేష మనునది లేనియ ద్వేషినగుదు
నెఱుగ ప్రియమును నప్రియ మెఱుగ నేను;
భక్తి గొల్చెడు వారల భావమెఱిగి
వారి యందుండు నాయందు వారునుండ్రు. 365

గీ. ఇతర దైవంబు లనుగొల్వ కెవ్వడైనఁ
నన్ను మాత్రము పూజించు చున్నవాఁడు
యెంతదుష్కర్ము డైనను యింగితునిగ
ఖ్యాతి నందుచునున్నాడు భూతలమున. 366

గీ. మఱియు నాతఁడు దురితముల్ మానివైచి
నిత్య ధర్మాత్ముఁ డగునయ్యు నిముషమాత్ర
మునల బొందును, అక్షరమైన శాంతి
యోగ యుక్తుండుగా నాతఁ డున్నకతన. 367

గీ. నన్ను సేవించి పాపులు పుణ్యజనులు
స్త్రీలు వైశ్యులు శూద్రులు వారువీరు
యనక యెల్లరు మోక్షంబు నందగలరు
భక్తియుక్తులు వారలై వరలుకతన. 368

సీ. ద్విజుల ముఖ్యుల క్షాత్రవంశజులమాట
వేరుచెప్పంగ వలెనోయి వీరవర్య !
అట్టియుత్తమ వంశాన బుట్టియరియు
క్షరము సుఖహీన మైనయీధరణినుండి
వ్యర్థుడవుగాక గొల్వుము భక్తినన్ను. 369

గీ. మనసు నాకిచ్చి పూజలు మరియుచేసి
భక్తి వందన మిడినన్నె పరమగతిగ
నాత్మ భావించి మరిపర మాత్మనగుము,
అడుగ కయెగుట్టు చెప్పితి నర్జునవిను
నాకుప్రియుడవు గాన యీ లోకమందు." 370

తొమ్మిదవయధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## పదవ యధ్యాయము

### (విభూతి యోగము)

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు

గీ. "ఇంత వఱకును నాపల్కు లెంతో శ్రద్ధ
విన్న వాడవు గావున వినుతుమరల,
ప్రీతి పాత్రుడ వైననీ హితముగోరి
శ్రేష్ఠ మైనది యిదిమరి చేరివినుము. 371

గీ. నాదు పుట్టుక నెఱుగరు నాకులెవరు,
యెరుగ రట్టులె మరిబుషీ శ్వరులుగూడ
వారి పుట్టుక లకునేను కారణమయి
పూర్వ ముంటిని గావున బోధ పడక. 372

గీ. అజుడ ననియును మరినేన నాదిననుచు,
నఖిల లోకేశ్వరుండ నే నగుదుననుచు
నెవ్వ డెఱుగుచు నున్నాడో యిూజగాన
నట్టి యాతడె మోహంబు నందకుండ
నఘువి ముక్తుడు గానగు నవనియందు. 373

గీ. బుద్ధి, జ్ఞానంబు, విజ్ఞాన వృద్ధి, మరియు
శమదమంబులు, సమతయు, క్షమయుగూడ,

భవము, నాశము భయమని యభయము, హింస,
కీర్తి, యపకీర్తి, దుఃఖంబు తృప్తి, తపన,
మొదలు గాఁగల భావముల్ భూతములకు
గలుగు చున్నవి నేవాని కారణముగ. 374

గీ. జగతి ప్రజలకు పూర్వులౌ సప్త ఋషులు
మనుజ పూర్వులు నల్వురు మనువులైన,
నేను భావింప పుట్టిరి గానివారు
స్వభువు లెప్పుడు గాలేని వారుసుమ్ము. 375

గీ. ఇట్టి నావిభూతియథార్థ మెవ్వడెరుగొ
యతడె నిశ్చల యోగంబు నందగలడు;
ఇందు సందేహ మేలేదు, యింద్రతనయ !
అట్టి వాడవు గమ్మోయి, అమలచిత్త. 376

గీ. భూత ములస్పృష్టి కంతకు హేతువునని,
యస్మ దాజ్ఞనె నడచెడి వన్వయనియు,
భావ నముచేసి నిశ్చల భక్తిగలిగి
పూజ గావించు చున్నారు బుధులునాకు. 377

గీ. చిత్త ములుచేర్చి నాయందు స్థిరులునగుచు
జీవ నముగూడ నాతోడి జీవనముగ
మలచు కొనుచును నాకథల్ మరగివినుచు
సంత సింతురు వారలుస్వాంతములను. 378

గీ. చిత్త మట్టులు నాయందు చేర్చిసతము,
ఇష్ట దైవంబు గాభజి యించువారి
కొసగె దనుబుద్ధి మరిదాని యోగమునసె
మోక్ష సుఖమంది వారలు ముదముగంద్రు. 37

గీ. వారి యందలి దయచేత వారిహృదయ
సీమ లందున్న చీకటిన్ బిమ్మ్రవైచి,
జ్ఞాన దీపంబు వెలిగింతు దానివలన
చీక టిల్లను నరకమున్ చేరకుండ
పగటి వెలుగను మోక్షమున్ వారుగంద్రు. 380

అర్జునుడు అడుగుచున్నాడు

గీ. "పరముడనియును, నజుడని, పావనుడని,
పరమ తేజస్వరూపి, వ శుద్ధుడవనియు,
అఖిల మునుసిండి వెలుగున నాదివనియు,
వ్యాసభగవాను డసుచురి యసితమౌని,
యఖిల ఋషులును నారదుం డమరమౌని,
దేవలుండునునినుగూర్చి దెల్పిరిగద;
అట్లెనీవును నాతోడ నంటివిపుడు. 381

గీ. ఓయిగురు దేవనాకీవు శ్రేయమొసగు,
సద్గురునిజేరుతత్వంబు సంగ్రహముగ
తెలిపితివిగాన సత్యంబు దెలిసికొంటి;

నీనిజస్థితిగాహ్యంబు కానిదోయి;
యమరులకుఁగాని, యసురులకైనఁగాని. 382

గీ. భూతభావుండవైనయో పురుషవర్య !
అఖిల జగముల రక్షించు నాదిదేవ !
నిన్ను నీవెయె యెఱుంగుచు నున్నదేవ !
కావు గ్రాహ్యంబు యితరుల కీవుదేవ !
అనియె అంగితి శిష్యుండ నగుటచేత. 383

గీ. ఏవి భూతుల చేతను నీవుజగము
నంత టనునిండి యుంటివో యావిభూతు
లమర మైనవి యగుటచే నరయలేరు;
వాని నెఱిఁగింపఁ దగియున్న వాడవీవు. 384

గీ. యోగి వగునిన్ను నిత్యమే యోగమునను
జెలిసి కొనవలె శ్రీకృష్ణ దెలుపుమోయి;
ఎట్టి భావంబు తోనిన్ను గట్టివైచి
నిన్ను పూజింప వలెనేను నిజమెఱుంగ. 385

గీ. ఓయి శ్రీకృష్ణ నీయోగ మాయవింటి,
శ్రుతిపుటంబుల జేరెను సుధవిధంబు
తనివి తీరదు నేనెంత వినినగూడ;
మరల జెప్పుము నీయోగ మహిమవిందు
నీవి భూతుల వివరంబు నెనదుతోడ." 386

శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు

ఆ. "ఇదిగొ చెప్పుచుంటి నీవిభూతులునావి,
యవియనంతములును నమరములును,
మఱియువి స్తృతములు మహినిండియుండును;
అందు శ్రేష్ఠములను విందువిపుడు. 387

గీ. అఖిల భూతంబు లందలి యాత్మనేను,
ఆదిమధ్యాంత ములులేని యట్టిదాత్మ,
అనియె ఱుంగుము అర్జునా యావిభూతి
యన్ని టననిండి యున్నదీ యవనిమీద. 388

గీ. అగుదు విష్ణువు నాదిత్యు లందునేను,
వెలుగు లందున కిరణాల వెలుగునగుదు,
గాలు లమరీచి యనుపేర గాలినగుదు,
చంద్రు డనునేను చుక్కల సరసనుందు. 389

గీ. వేద ములలోన నేసామ వేదమునయి,
వాస వుండను సర్వదే వతలలోన,
నింద్రి యంబుల నేలెడి యెదనునేను,
భూత ములయందు కదలాడు భూతమేను,
(ప్రాణు లందున చేతన జ్ఞానమేను.) 390

గీ. రుద్రు లందున నేశంక రుండనగుదు,
ధనదు డనునేను యక్షుల దనుజవరుల

అష్ట వసువుల నేనౌదు నగ్నిగాగ
పర్వ తములందు నేమేరు పర్వతమును. 391

గీ. కులపురోహితగురులకు గురువునైన
యాబృహస్పతి నేనౌదు నద్భుతముగ,
స్కందు డను నేనె సేనాను లందుగూడ,
సరసు లందున నే పెద్ద సాగరమును. 392

గీ. భృగుడు మహర్షుల ఋషులందు పెద్దను మరి
అక్షరములందు నోంకార మక్షరమును
యజ్ఞములయందు నేజప యజ్ఞమగుదు,
పర్వ తములందు కైలాస పర్వతమును. 393

గీ. వృక్షములయందు నశ్వత్థ వృక్షమగుదు,
నారదుండను దేవర్షి వారములను,
చిత్రరథుడను గంధర్వ శేఖరులను,
సిద్ధు లందు ను కపిలుడ వృద్ధుడమరి. 394

గీ. అగుదు నుచ్ఛైశ్రవంబును నశ్వములను,
దంతు లందున నైరావ తంబునగుదు,
నరుల యందున రాజుగా నన్నెఱుగుము;
అమృత మునకును ననుజన్మ లగుటచేత. 395

గీ. ఆయుధంబు లనేనువ జ్రాయుధమును.
ధేను గణములనే కామ ధేనువునయి,

సంతుఁగూర్చెడికందర్ప స్వామినగుదు;
నహిగణంబులవాసుకి నగుదునోయి. 396

గీ. నాగు లందున నేనున నంతుఁడమరి.
వరుణు డను నేన వారిదే వతలయందు;
పితరు లందున నర్యము పితనుమరియు;
దండ నము చేయు యముడను ధరణియందు. 397

గీ. రాక్ష సకులంబు లను నేప్రహ్లాదుడనయి
గణిక వరులకు నగుదును కాలమేను;
మృగము లందున మృగ రాజు నగుదు నేను,
పక్షి రాజగు గరుడుండ పక్షులందు. 398

గీ. గాలి నగుదును సత్వర గాములందు,
శస్త్ర ధారుల లోరామ చంద్రుడమరి;
మొసలి నగుదును జలచర భూతములను,
వాహి నులయందు గంగాభ వానినగుదు. 399

గీ. విద్య లందున నధ్యాత్మ విద్య నేను
వాద మును నేనె వాదించు వాది నేనె,
జంగ మస్థావ రంబుల జగమునకును
నాది మధ్యాంత ములు నేనె యాగుచునుందు. 400

గీ. విశ్వ ముఖుడను బ్రహ్మను విశ్వమునకు;
అక్ష రంబుల కాదయౌ యక్కరమును,

అక్షయంబగు కాలంబు నగుదునేను;
అఖిల జగతికి సాక్షిని యగుచుమరియు. 401

గీ. సర్వ నాశన హేతువు చావునేను,
భూత సృష్టికి కారణ భూతనేను;
స్త్రీగణంబుల కీర్తిని శ్రీనిమరియు,
స్మృతిని, మేధను, క్షమతోడి ధృతినినేన. 402

ఆ. మార్గశీర్షమగుదు మాసంబులన్నింట
నారు ఋతువులందు నామనినయి
వేదములను సామ వేదంబునేను; గా
యత్రి మంత్రబీజ మగుదునోయి. 403

ఆ. జూదరులకు నేను జూదమైతోచుచు
వెలుగులకును నేను వెలుగునగుచు,
కృషికవరుల దైన కృషిఫలమగుచునే
సత్వ గుణము నగుదుశక్తులమరి. 404

ఆ. వృష్ణివంశజులను కృష్ణుండనేనౌదు
పాండవేయులందు పార్థుడమరి
మునులయందు వ్యాసమునిభగవానుడ
శుక్రుడగుదు నేను సుకవులందు. 405

ఆ. విజయులైన వారి విజయంబునేనౌదు,
దండ నాధిపతుల ధర్మమగుదు;

గుహ్యతమము లందు గుహ్యంబుగానుండి
జ్ఞాను లందు నేను జ్ఞానమగుదు. 406

ఆ. భూత ములకు నేనె మూలబీజంబును,
చేత నముల మరియు చేతనముల,
నేను లేని దొకటి కానవు జగమందు;
సర్వ మందు నుందు సత్యమిదియు. 407

ఆ. ఇట్టి దివ్యమైన యీవిభూతులకెందు
నంత మొకటి లేదనంతములవి;
బుద్ధి పూర్వ కముగ బోధించితినినీకు
మోసపోయిమాయ మునుగుదువని, 408

సీ. కలిమి గలవారు, శక్తిని గలుగువారు,
సత్వ సంపన్నులును, మరి సత్యరతులు
నస్మ దీయాంశ జన్మించి రవనియందు;
అనియెఱుంగుము కౌంతేయ యదినిజంబు. 409

గీ. ఇంత వఱకును దెల్పిన యీవిభూతి
నాది సంపూర్ణ మైనది కాదుపార్థ !
అందునాల్గవ వంతునే నంటినిపుడు;
దాని వలననె వ్యాపింతు ధరణినెల్ల
చేత నములను మరియున చేతనముల. 410

పదియవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

(పదునొకండవ యధ్యాయము)

విశ్వరూప సందర్శనము

అర్జునుడు అడుగుచున్నాడు.

గీ. "నీవు కరుణించి తెల్పిన నీవిభూతి
విస్తృతమును వీనుల వినుటవలన
విగత మోహుండ నైతిని వేత్తనైతి;
నాత్మ పరమాత్మ గుహ్యంబు నరసినేను. 411

గీ. కమల పత్రాక్ష ! ఇచటలోకమునగల్గు
భూత భవములు మరణముల్ బోధపడియె;
మరియు నీదగు నక్షర మహామహత్తు
తెలిపితివిగాన తెలిసెను దృశ్యముగను. 412

గీ. అదియు నుండగ నీదివ్య హాత్స్వరూప
మెట్టిదియొ చూడనాకిష్ట మిచ్ఛగలిగె
దాని చూచుట కేనును తగుదునేని,
నాకు చూపించు కోరిక నీకుకలుగ,
నీస్వ రూపము చూపుము నీరజాక్ష !
ఆది గురుడవు శ్రీకృష్ణ అమరతేజ" ! 413

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు

గీ. "చూడు మర్జున నాదగు చోద్యములను
వేన వేలుగ దేవతల్ లీనమైన

చిత్ర చిత్రిత వర్ణ విచిత్రమైన
పెక్కు రుగదోచు దేవుడనొక్కడనను. 414

గీ. ద్వాదశాదిత్య యుతమైన దైవమునను,
వసువులెనమండ్రు రుద్రులు పదునొకండ్రు;
యేడు గాలులతో నున్నయేడుగడను
అరయు మర్డున యదిగాక యచరఁగల్గు
జంగమంబులు స్థిరభూత చయములెల్ల
నొకచతుర్థాంశ నాయందు నున్నవదిగొ. 415

ఆ. దివ్యరూపు నన్ను దిలకింపఁజాలవు
కనులు నీవి భౌతికములుగాన
దివ్యదృష్టి యిదిగొ తిలకింపుమర్జునా
యీశ్వరేశ్వరుడన నశ్వరుడను." 416

సంజయుఁడు చెప్పుచున్నాఁడు.

గీ. "కూర్మినటుపల్కి కృష్ణుండు కురుకులేశ,
పార్థునకుఁజూపె తనదైన వైష్ణవమును,
పరమ యోగీశ్వరేశ్వర వైభవమును,
విశ్వమయమగు తనమూర్తి విశదముగను. 417

గీ. బహుళవక్త్రిని మరియును బహుళనేత్రి,
నద్భుతానేక మూర్తిని యచ్యుతుమరి

దివ్య భూషణ భూషితు దివ్యమైన
యాయుధోద్యత బాహుని యరసిమరియు. 418

గీ. దివ్య మాల్యాంబరంబుల దివ్యగంధ
లేపనంబుల నలరెడు రూపునిమరి
విశ్వతోముఖు, సర్వయు విస్మయముగ
నఖిల దేవస్వరూపున నంతునరసె. 419

గీ. అగణితంబుగ సూర్యులు ఆకసమున
నొక్క మారుగ నుదయింప నుదితమైన
తేజ మంతటి తేజంబు నోజమీరయు
నామహాత్ముని దివ్యదేహంబునందు
వివిధ భాగంబు లనుగని విస్మయుడయి
యొక్క చోటను గనియె తా నున్నజగము. 420

గీ. విశ్వ రూపంబు నటుగని విజయుడంత
మేను పులకింప తానును మేనువంచి
యంజలిఘటించి పరమాత్మ నాత్మదలచి
యనియె నిట్టులు దివ్యదేహాత్ముతోడ". 421

అర్జునుడు చెప్పుచున్నాడు.

గీ. "అరసితిని దేవ నీదు దేహంబునందు
నఖిల దైవంబు లనుమరి యఖిలఋషుల,

సర్వ భూతంబు లనెగాక స్వభువునజుని
యహిప రంబుల దివ్యంబు లైనవాని. 42

గీ. బహుళ బాహూదరుండవు బహుముఖుడవు
అగణితంబగు కనులన నంతుడవును,
విశ్వ రూపుని నినుగాంచి విభ్రమమున,
మొదలె ఉంగను తోచదు తుదియుకూడ
నడుము శూన్యము కన్నుల బడకయుండె
నాదిమధ్యాంత రహితుండవైన దేవ
విశ్వ మయునిగ నినుగంటివిశ్వరూప. 423

సీ. మకుట మధరించి గదదాల్చిమరిసుదర్శ
నంబు చేపట్టి కాంతిపుంజంబవగుచు
భూన భంబుల మధ్యముపొడవుసూసి
మరియు ననలార్కు లంతటి మహిమతోడ
నంత టనునిండి వెలుగుని న్నరసితేను. 424

గీ. అక్ష రమునీవు పరముడ వజుడవీవు,
వేది తవ్యుండ వనియును విశ్వమునకు
పరమ ధాముండవనియును ప్రభుడవనియు,
మరిస నాతనుం డవనినే మదిదలంతు. 425

గీ. ఆది మధ్యాంత రహితుండ వైన దేవ
సూర్య చంద్రులు కనులైన శోభనాంగ,

అగ్ని వక్త్రుడు నీదునా స్యంబుతోడ
స్వప్రకాశుండ వగుచునీ జగతినెల్ల
కాల్చుచున్నట్లు నిన్ను నే గాంచుచుంటి
(బోచు చునట్లునిన్ను నే చూచుచుంటి.) 426

గీ. భూన భోంతర భాగంబు పూర్ణముగను,
నీవొకండవె వ్యాపించి నావుమరియు
దిక్కు లనునింపు నీదివ్య తేజమరసి
భీతి లుచునుండె లోకాళి భూతతతులు. 427



గీ. చొచ్చు చున్నారు సురలుని న్నిచ్ఛతోడ
కొంద అతిభీతి కొలుచుచు నుండిరదిగొ
స్వస్తి పలుకుచు సిద్ధర్షి సంఘమెలమి
పొగడు చుండెను స్తుతిపాఠ ములనుచదివి. 428



గీ. యక్ష రాక్షసగంధర్వు లమరవరులు,
సిద్ధ సాధ్యులు వసువులశ్వినులుకవలు,
రుద్రులాదిత్యు లునుపిత రులునుగూడ
పరయు చుండిరి విస్మయ మందినిన్ను. 429



గీ. పెక్కు ముఖములు కన్నులు పెద్దతొడలు
పాద ములతోడ కడుపుల భయదమైన
కోర పండ్లను తెఱచిన నోరుగల్గి

విశ్వ రూపము నీయది విశదపడగ
ప్రాణి కోటులు భయపడె; నేనుగూడ
భీతి నందుచు నుంటినో భ్రాతభావ. 430

గీ. నింగి నేలను దాకుచు నిండి వెలుగు
పలుర కంబుల కాంతుల తెఱచుకున్న
ముఖము లక్షుంగ గలనీదు మూర్తిఁజూచి
భీతి లుచునుంటి శాంతియు ధృతినశించె. 431

గీ. భీకరములైనకోరలుగాక మరియు
విలయ వహ్నులు గక్కు మోములనుగాంచి
దిక్కు తెలియక నేనెంతొ పొక్కుచుంటి:
సుఖము లేదోయి దయనన్ను జూడుమోయి. 432

గీ. ఆహవస్థలిదుర్యోధనాదులెల్ల
పుట్టుగ్రుడ్డికిపుట్టిన పుత్రవరులు,
తాత భీష్ముండు, ద్రోణుడు, సూతుడైన
కర్ణుడేగాకవారిపక్షమునగల్గు,
సేనయందలియఖిలభూజానులెల్ల!;
మరియు మనవారు యోధులు మహితబలులు
తీక్ష్ణభీకరదంష్ట్రిల తెఱచుకున్న
నీదునోళ్ళను సంద్రాలనీదుచుండ్రి. 433

గీ. ఏరులెట్టులు తమవారితోలుకొనుచు
వార్ధిముఖముగపయనించివార్ధిఁబడునో,

యుల్లై నరవాహి నులునీదు నాస్యములను
వార్ధు లందున బడుచుండె పరమపురుష. 434

ఆ. పక్షి యుతము లైన పక్షులుమిడుతలు
కీడె ఱుంగ కగ్ని కీలలఁబడు;
నల్లై జీవ కోటి యగ్నులగురిపించు
నీదు నోళ్ళ నుబడి యీాదులాడె. 435

గీ. వాడి కోరల వహ్నుల వా తెఱలతో
నఖిల మును(మ్రింగి నాకుచున్నట్లుతోచె,
నీభ యంకర మూర్తియునీమహాత్తు
లోక మెల్లెడ నిండిచీ కాకుపఱచె. 436

గీ. ఎవ్వ డవోనీవు యిట్టిగూ పెందుకొఱకో
విశ్వరూపంబు దాల్చెదు వేళయేదో
యాది పురుషుడ వీవని యడుగుచుంటి
నెఱుగఁజెప్పుము యిదియెనాయేటికోళ్ళు." 437

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

గీ. "నేను కాలుడ లోకముల్ నీఱొనర్తు,
నిట్లు చేయుట కేనాకునిట్టిరూపు;
విశ్వ మయముగ వ్యాపించి నశ్వరమగు
లోక ములమ్రింగు మృత్యువున్ లోకమందు;

పరబలంబులనీకున్న పగతులెవరో
చచ్చె దరువారు నీవును చంపకున్న. 438

గీ. విశ్వరూపంబు దెలిపిన విధముగాను
నీవు చంపక పూర్వమే నీపగలను
చంపి నాడను గావున సవ్యసాచి
సమరమొనరింపలెమ్మునా సాధనముగ;
యశము నార్జింప నీదురాజ్యమును గొనగ. 439

గీ. నేను పూర్వమె బలిగొన్న నీపగలగు,
భీష్ము, ద్రోణుని, కర్ణుని, విధిగఁజంపి,
సైంధవునిజంపియటులెనీబంధుజనుల
యుద్ధమొనరించిచంపుమో యోధముఖ్య !
భయము పడకోయి జయమును బడయఁగ నీవు." 440

సంజయుడు చెప్పుచున్నాడు.

గీ. "అట్లు శ్రీకృష్ణు వచనంబు లాలకించి
దోసిలొగ్గుచుమరిమరిచేసినతులు
భీతి కంపించి యనియెను విజయుడపుడు
వడకు కంఠంబు తోడను వడివడిగను." 441

అర్జునుడు చెప్పుచున్నాడు.

ఆ. "కృష్ణ ! నీదుగొప్ప కీర్తి కిదగినట్లు
జగము లుండెప్రీతి సంతసించి

పలల భుజులు భీతి పరుగెత్తుచుండిరి,
సిద్ధ పురుషు లునతిచేసిరదిగొ. 442

గీ. సృష్టికర్తను సృజియించు సృజనశక్తి
వైనసర్వోన్నతుండవునాదికర్త
వగువిభూతివినీకిట్టు లవనిప్రజలు
అడఁగియుండుటలోవింత నరయఁబోను. 443

గీ. అక్షరమవీవు సదసత్తు కన్యమైన
యాదిదేవుడ వీవున నంతుడవును,
వేత్త వును వేది తవ్యుండ వీవు దేవ!
ఓ పరంధామ ! నీవుస ర్వోత్తముడవు,
విశ్వ మయముగ వెలసినవిశ్వరూప !
పురుష వరులను నుత్తమ పుణ్యపురుష. 444

గీ. వాయు దేవుడ వగ్నివి వరుణుఁడవును,
బ్రహ్మ వును బ్రహ్మ తండ్రివి పరముడవును,
చంద్రు డవుయముఁ డవుసుప్రజాపతివియు,
సకల మూర్తుల కిదెనమస్కార శతము. 445

గీ. ఎదుట మ్రొక్కెదచేతులనెత్తి పెట్టి,
వెనుకకిడియెదవినతులు వేన వేలు,
యఖిలదిక్కులకిడెదునా యంజలులివి,
యమిత బలవిక్రముండవు సన్నిదిశల

వ్యాప్తి చెందినవాడవు వైష్ణవుడవు
భూనభోంతర దేహివో భూరితేజ ! 446

గీ. దివ్యమహిమాన్వితుడవని దెలిసికొనక
బంధువుడవను సఖుడవన్ పరిచయమున,
ఆట లందున కథలల్లు మాటలందు,
శయన భోజన పరిహాససమయములను,
తప్పులుండిననాయవి తలపఁబోక,
నన్ను మన్నింపుమో దేవ సన్నుతింతు;
నప్రమేయప్రభావయో యాదిదేవ ! 447

గీ. సాటిలేనట్టి మహిమలస్వామివనుచు,
జంగమస్థావరంబులజనకుడవుగ,
సకలజీవులునినుపూజసల్పుకతన
ఘనగురుండవు, కరుణింపఘనసముడవు. 448

గీ. కానపూజింతునో దేవ ! ఘనసమాన !
నీకుసాష్టాంగముగ మ్రొక్కి లోకవంద్య !
తనయు తప్పులుమన్నించు తండ్రివిధము,
సఖునిలోపాలు సవరించు సఖువిధంబు,
పేదప్రియురాలి నోమెడు ప్రియువిధంబు,
లోపములునావిసైపుము లోకనాధ !
నన్నుక్షమియించిదయఁజూడుసన్నుతాంగ ! 449

గీ. మున్నెఱుంగనియదినీవి భూతిగాంచి
సంతసించుచునుంటిని నంతరూప ।
మరియు బాధనుజెందితి మదిభయమున
కాన, కృష్ణుని రూపానకానిపించి
నన్నుదయఁజూడుమో దేవ ! వెన్నదొంగ. 450

గీ. వేయిచేతులుకన్నుల విశ్వరూప !
కృష్ణరూపాననినుగాంచ నిచ్ఛగలిగె;
మకుటమునుదాల్చి గదశంఖ ఖడ్గచక్ర
ములు ధరించిన బావవై ముందునిలిచి
కానుపింపుము దయచేసి కాల దేవ !"

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

గీ. "ఇట్టి నారూపమున్నెన్న డెట్టివారు
చూచియెఱుగనిదిది చూడ చోద్యమనిది,
మరియు నంతము నాద్యము మహితమిద్ది,
పూర్ణమియ్యది మరియున పూర్వమిద్ది
కాన చూపితినాత్మయోగంబువలన
నాకు ప్రియుడవుగాన నీలోకమందు. 452

గీ. వేదములునాల్గుచదివిన వేత్తలైన,
యాగనైష్ఠికులగుసోమ యాజులైన,
దానధర్మంబులనుచేయు ధనికులైన,
ఉగ్రనిష్ఠులుతాపసినర్గమైన,

కఠినభోజననియమసంకల్పులైన,
కనగసాధ్యముకానిది కననిదిద్ది
నీవొకండవెకనగల్గితీవిభూతి
లోకమందీవుప్రియుడవునాకుగాన." 453

సంజయుడు చెప్పుచున్నాడు

గీ. "అర్జునునితోడ శ్రీకృష్ణుడట్లుచెప్పి,
మహిమముడుగుచుకృష్ణుగా మరలదోచె:
శాంతమూర్తిగనటుఁదోచిసఖునిదైన
భయముపోవుటకోదార్చపార్థునపుడు" 454

అర్జునుడు చెప్పుచున్నాడు

గీ. మనుజరూపుని (శ్రీ)కృష్ణ ! మరలనిన్ను
నెదుటగనగానెమనసెంతో కుదుటపడియె
నుంటినేననితోచెనా యింటివారి
నడుమనేనని, దేహమున్బడసితినని." 455

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

గీ. "నీవుగనినట్టిచిత్రమౌనావిభూతిఁ
గాంచుటన్నదిసాధ్యంబుగానిదోయి,
దేవతలుకూడనిత్యమునావిభూతిఁ
జూడఁగోరుచునుందురు శూరవర్య ! 456

గీ. నివుగనినట్టిచిత్రమౌనావిభూతి
వేద్యమేకాదునాలుగువేదములకు,
యాజ్ఞికులకును నయ్యదికానబడదు,
దానధర్మలకదికాన రానిదగును
తలపరానిదియదిమరి తాపసులకు. 457

గీ. ఇతరచింతలులేకుండఁకీతినెవండు
ఒక్కనామీద భక్తితోనున్నవాఁడొ
యతడెతత్వంబునెరిగిన యాతడగుచు
విశ్వరూపంబుదర్శించువిజ్ఞుడగును.
ఓపరంతప యిదియెనూఓమ్మనగను. 458

సీ. అఖిలకర్మముల్ నాకొఱకాచరించి
దేనియందునుసంగంబులేనివాడు
నన్నెపూజించిభక్తితోనున్నవాడు,
ప్రాణులందునద్వేషంబులేనివాడు
సత్యమునుఁపొందుతత్వదర్శనుడుసుమ్ము
విశ్వరూపంబు దర్శించు విజ్ఞుడుమరి,
ఓ పరంతపయిదియెనూ ఓమ్మనగను." 459

పదునొకండవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## (పండ్రెండవ యధ్యాయము)

### భక్తి యోగము

అర్జునుడు అడుగుచున్నాడు.

గీ. "నిర్గుణునినిన్ను నాత్మధ్యానించువారు,
సగుణ మీవని పూజలు సల్పువారు,
ఇరుతెరంగుల భక్తులం దెవరుమేలో
నాకువివరింపుమోకృష్ణ లోకనాథ." 460

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

గీ. అనిశమెవ్వడునాయందె మనసునిలిపి,
శ్రద్ధ చూపుచు నన్నుపా సనముచేయు
నిత్య యుక్తుడె నాకునునిండుగూర్చు
భక్తు డగుచును నుత్తమ భక్తుడగును. 461

గీ. సర్వ భూతంబులకుమేలు సల్పువాడు,
ఇంద్రియంబుల నరికట్టి యేలువాడు,
అన్ని యెడలను సమభావ మున్నవాడు,
ఇట్టి దట్టిది యనినిరూ పింపరాని
సకల కూటస్థ మయియచం చలమునైన
యక్ష రంబగు బ్రహ్మంబు నాత్మదలచు
వాడుగూడను పొందుచు న్నాడునన్ను. 462

గీ. క్లేశములు హెచ్చునిర్గుణోపాసకులకు
సగుణమునుగొల్చు సామాన్యజనులకంటె;
అవని దేహులుదుఃఖదోషాత్ములగుట
క్లేశమునె తెచ్చునిర్గుణోపాసనంబు,
సగుణమునుపూజసల్పుటే సౌఖ్యదంబు. 463

గీ. భగవదర్పణబుద్ధితో వారివారి
కర్మములుచేసినిష్కామకర్ములుగ
ఫలములనుగోరకుండగ వదలివైచి;
నన్నె నమ్మిచునితరంబునమ్మకుండు
వారిదరిఁజేర్తు సంసారవార్ధినుండి. 464

గీ. చిత్త ముంపుము నాయందుస్థిరముగాను,
బుద్ధి నిలుపుము నాయందుశ్రద్ధగలిగి,
యవల నుందువు నన్ననీ వాక్రమించి;
యిందు సందేహమేలేదు, ఇంద్రతనయ ! 465

గీ. చిత్త మట్టులుస్థిరముగాఁజేర్చుటకును
శక్తుడవునీవు కావేనిసవ్యసాచి;
యత్న మొనరింప నదినీకునలవడునదె
కూసువిద్యగ సంతతాభ్యాసనమున. 466

గీ. అట్టియభ్యాసయోగంబునందుటకును
శక్తుడవునీవు గాకున్నసవ్యసాచి,

నానిమిత్తము కర్మముల్ పూనిచేసి
పొందగలవోయినారూపమోక్షపదము. 467

గీ. నానిమిత్తముకర్మముల్ పూనికూడ
చేయఁజాలకయున్న కౌంతేయయింక
నఖిలకాలికవైదికమైననీదు
కర్మఫలములత్యాగమేఘనతపంబు. 468

గీ. మూర్ఖుడొనరించునభ్యాసమునకుమిన్న
జ్ఞానయోగంబు, మరియునుదానికంటె
జ్ఞానయుక్తంబుధ్యానంబుసమధికఁబు,
అట్టిధ్యానఁబుకంటెనుగట్టిదోయి,
కర్మఫలమునుద్యజియింపగలుగుశక్తి
మూలమయ్యదిశాంతికిమోక్షమునకు. 469

గీ. భూతతతులందు ద్వేషమున్ బొఁదనట్టి
స్నేహితునివలెనెల్లరఁజేరునట్టి,
నేనునాదనునహమును లేనియట్టి,
సుఖముదుఃఖఁబునొకరీతిచూచునట్టి,
యోర్పుగలవాఁడు తృప్తితోనున్నవాడు,
యోగయుక్తుడు, మరియును త్యాగధనుడు,
నిశ్చలంబుగబుద్ధిని నిలుపువాడు,
ప్రీతిపాత్రుడు భక్తుడు ప్రియుడునాకు. 470

ఎవనిగనినంతలో కాని కెదవగులదో
లోకమునుగాంచియెవడు చీకాకుపడడో
భయము క్రోధంబు హర్షసంభ్రమములకును
లోను గాకుండనుండెడుజ్ఞాని యెవడో
యట్టి యాతడు నాప్రియుడనఘుడతడు. 471

గీ. అపనినపేక్ష పరిశుద్ధుడైనవాడు,
దక్షుడయ్యును మరి తట స్థముగనుండి,
యెట్టియారంభమును చేయనట్టివాడు,
దిగులుచెందని యాతడీ జగమునందు,
ప్రీతిపాత్రుడు భక్తుడు ప్రియుడునాకు. 472

గీ. ద్వేషి గాకుండ రాగసంతోషిగాక
శోక మోహంబులను మదిచొరగనీక
పుణ్యపాపంబులగు కార్యములను విడిచి
నన్నుపూజించు భక్తుడే నాకు ప్రియుడు. 473

గీ. అరులయందున మరియును నాప్తులందు,
నటులె మానావమానంబులందుగూడ
సుఖదుఃఖ శీతోష్ణసహనమందు
సమత చూపెడు మద్భక్త జనుడొకండె
ప్రీతిపాత్రుడు నాకును ప్రియుడతండు. 474

గీ. దేనియందును గోరిక లేనివాడు,
అల్పసంతోషి స్థిరబుద్ధి యైనవాడు
దూషణంబును గాకుండ భూషణమును,
లెక్కగొననట్టి ద్వంద్వంబు లేనియట్టి
యతడు నాభక్తుడును మరియనఘుడగును. 475

గీ. ఎవడు నామీదిశ్రద్ధనే నిటులచెప్ప
ధర్మసంబంధమగునమృతమును గ్రోలి
నన్నె గతిగాగ ననమ్ముచు నాదు పూజ
చేయునాతడె భక్తులశ్రేష్ఠతముడు. 476

పండ్రెండవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

(పదమూడవ యధ్యాయము)

క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగము

అర్జునుడు అడుగుచున్నాడు

గీ. "ప్రకృతి, పురుషులు వేరను ప్రవచనమును
క్షేత్రమెయ్యదో క్షేత్రజ్ఞ చిహ్నమెద్దొ
జ్ఞానమననేదొ, జ్ఞేయమౌదావిగూర్చి
నాకు వివరింపుమోకృష్ణ లోకనాథ."

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

గీ. దేహమనునదె క్షేత్రంబు తెలియుమోయి,
దానినె ఎఱిగిన దేహి క్షేత్రజ్ఞుడోయి,
దేహమునుమరి దేహిని తెలియువారు
తెలుపుచుండిరి భేదంబు తెల్లముగను. 478

గీ. క్షేత్రములయందు క్షేత్రజ్ఞ చిహ్నమేను,
అని యెఱుంగుము పార్థనన్నరయుకొఱకు,
క్షేత్రమును మరి క్షేత్రజ్ఞ చిహ్నమునను,
నెఱుగుటన్నదె జ్ఞానంబు "ఎఱుక" యదియె. 479

గీ. క్షేత్రమెట్టిదోయిక దాని పూర్వమెదియొ
మరియు నందున్న క్షేత్రజ్ఞమహిమ యేదొ
సంగ్రహంబుగ చెప్పెద సవ్యసాచి 480
వినవలయు దాని నిప్పుడు వీనులలర.

గీ. ఋషుల చేతను వేదసం హితలచేత
క్షేత్ర విదుడును క్షేత్రంబు చెప్పఁబడియె.
వివిధ రీతుల మరియును వేరువేరు,
హేతు వాదంబు వలనస హేతుకముగ
బ్రహ్మ సూత్రంబు చేస్థిర పరుపఁబడుచు. 481

గీ. ఇరువ దియునాల్గు భూతత్వ ములనుగల్గి
ఈశ రీరము భువిపడె నీశ్వరేచ్ఛ;
ఇదిమ హాభూత పంచక స్పష్టమాయి,
యువయ వంబులు పదిటిచే నలరిమరియు
పంచతన్మాత్ర విషయసం బంధియగుచు
బుద్ధ్యహంకారచిత్తమ వ్యక్తములను
తత్వధర్మంబుగలదిక్షే త్రమ్మనుమ్మ. 482

గీ. ఇంద్రియార్థంబులై దిటికిదివశంబు,
రాగివిద్వేషములరెంటి రాబడులగు
సుఖముదుఃఖ బులనునవి సోకుకతన
చేత నముగల్గు ధృతిగల్గు క్షేత్రమునకు. 483

గీ. ఎట్టి యభిమాన మునుచూప నట్టిదియును
దంభ రహితము, హింసనుదలపనిదియు,
స్థిరము గాచేయు నాచార్య సేవనమును,
ఆత్మనిగ్రహ మార్జవ మహముులేని
శౌచ ధర్మము, క్షమయును జ్ఞానమగును. 484

గీ. జన్మ మృత్యుజరావ్యాధి ధర్మములగు
దుఃఖ దోషంబులనుమది ద్రోసిపుచ్చి
పుత్ర దారాదిగృహముల మోహమునకు
లోనుగాకుండనున్న దే జ్ఞానమగును. 485

గీ. విషయ వాంఛలనాసక్తి విడుచునదియు
కష్ట సుఖముల నొకరీతి గాంచునదియు
ఒక్క నామీది భక్తితో నుండునదియు
నిశ్చలంబుగ భక్తిని నిలుపునదియు. 486

గీ. ఇతరులెవ్వరు లేనట్టి క్షితితలమున
ఒక్కడనెయుండి యచట వేరొకనికోరకు
వెదకుటన్నదె యధ్యాత్మ విద్యయనుచు
తెలిసి కొనునదె జ్ఞానంబు తెలియుమోయి;
వీనికెల్లను వ్యతిరేక మైనదొకటి
యగును నజ్ఞాన మనగనో యమలచిత్త. 487

గీ. మోక్ష మెద్దాని నెఱిగిన పొందగలవొ
సత్తటంచును మరియున సత్తటంచు
చెప్ప సాధ్యంబు గానట్టి గొప్పతత్వ
మైన బ్రహ్మంబు మరియుననాదియైన
జ్ఞేయమును నేను నీకిప్పు చెప్పుచుంటి. 488

గీ. పాణి పాదంబు లెల్లెడఁ గానబడెడు,
నగణి తంబగు నక్షుల నాస్యములను,
శీర్ష ములతోడ మరియును చెవులతోడ
భూన భంబుల మధ్యను పొడవుసూపు
దేహ దేహేంద్రియాభాస తేజమొకటె
జ్ఞేయమైనది యెఱుగు కౌంతేయ దాని. 489

గీ. ఇంద్రియార్థంబు లకునది మందిరమయి
వాని చేతను భాసించి వానికంటె
భిన్నమైనట్టి నిర్గుణ చిహ్నమైన
రూప మేలేని సంపూర్ణ రూపమద్ది. 490

గీ. అఖిల మందుండి యఖిలంబు నంటనట్టి
తామ రాకున జలమట్లు తళతళమను
రూప మేలేని సంపూర్ణ రూపమద్ది
జ్ఞేయ మైనదియెఱుగు కౌఁతేయదాని. 491

గీ. భూత తతులకు గల్గెడి చేతనమది
లోప లనెగాక వెలుపలి లోకమందు
నున్న చరముల స్థిరములనున్నదదియె,
దూర మగుచుండు దెలియని వారలకును,
సన్ని ధినెయుండు దెలిసిన జ్ఞానులకును. 492

గీ. భూత ములనుండి విడివడి పోనిదద్ది
మరియు వానికి విడివడి తిరుగునట్లు

భ్రాంతి గొల్పుచు విశ్వంబు ప్రాకుచుండు,
సృష్టికిని పుష్టికిని మరి నష్టమునకు
హేతు వగుచుండు భువిగల భూతతతికి. 493

గీ. వెలుగు లకుగూడ వెలుగైన వెలుగుమరియు,
చీక టులదోలియు పరమైన చిహ్న మోయి,
జ్ఞాన మునగాని జ్ఞేయుంబు కానిదోయి
సర్వ హృదయస్థమైనటి సముధికమది. 494

గీ. క్షేత్ర మునుమరి జ్ఞానవి జ్ఞేయములను
సంగ్రహంబుగ దెల్పితి సవ్యసాచి;
దీని నెఱిగినభక్తుడా జ్ఞానమునను
నన్ను బొందుట కర్హుడై యున్నవాడు. 495

గీ. పురుషుతోడనె ప్రకృతియు పుట్టియుండె,
నవియు నాదులు పురుషుడవ్యక్తుడయ్యె;
మరియు పరిణామ మనియెడి మహాగుణంబు
ప్రకృతి వలననె జనియించె పార్థవినుము. 496

గీ. కార్యకారణ కర్తృత్వ గౌరవమున
భూత సృష్టికిప్రకృతియే హేతువగును;
భూత గుణజన్య సుఖదుఃఖ భుక్తమునకు
పురుషు డగుచుండు కారణ భూతముగను. 497

గీ. ప్రకృతియందుండి పురుషుడు ప్రకృతిభవము
లైన గుణముల యనుభవమందియువల,
పుణ్య జన్మమొ పాపపు పుట్టువోమ
యెత్తుచుండును గుణసంగ హేతువుగను. 498

గీ. క్షేత్ర మందలి పురుషుడే శ్రేష్ఠుడుమరి
సన్ని ధివసించి కనిపెట్టు సాక్షియతఁడు
అనుమ తముచేత భరియించి యనుభవించు
గొప్ప ప్రభువగు పరమాత్మ గూడనతడె. 499

గీ. పరమ పురుషుని గుణపరం పరలతోడ
ప్రకృతి నింకూడ నెఱిగెడి పండితుండు
ఏవి ధంబుగ తానువ ర్తించుచున్న
జన్మరాహిత్యమందెడి జనుడెయగును. 500

గీ. ఆత్మ గనుచుండ్రి కొందఱు ధ్యానవశత
నరసి రికకొందరాత్మను నాత్మచేత,
మరియు కొందఱు సాఖ్యంబు వలనగనిరి;
కర్మయోగానగాంచిరి కర్మఠులును. 501

గీ. పై విధంబులనెఱుగని వారుగూడ
పరులచేతను వినియున్న వారలగుచు
నదెప రాయణ మనియెంచి యాచరించి
దాటు చున్నారు మృత్యువున్ ధన్యులగుచు. 502

గీ. ప్రకృతి పురుషుల సంయోగ ఫలితముగను
సచరాచర భూతంబు లీజగాన
పుట్టుచున్నవి పురుషలి భూతులుగను
తెలియు మర్జున యదియునా దేవునిచ్ఛ. 503

గీ. సర్వ భూతంబు లందునజగమునందు
సర్వసమభావ ముంచెడి సర్వమయుని
క్షరములందున్న దేవునక్షరునిగాంచు
నట్టియాతడు పరమాత్మ నరయగలడు. 504

గీ. అన్ని యెడలను పరమాత్మ నరయువాడు
అరసి తనలోని పరమాత్మ నాత్మయందు
తనను తానుగ హింసించు కొనడుగాన
పరమ గతియును మోక్షమున్ బడయఁగలఁడు. 505

గీ. ప్రకృతి చేతను విషయులం పటముచేత
చేయ బడుచుండు కర్మముల్ చిత్రములుగ;
ననియెఱుంగుచు తనదైన యాత్మనట్టి
కర్మ చేయనిదానిగా గనునుజ్ఞాని. 506

గీ. వేఱువేఱుగ కనిపించు వివిధములగు
భూత తతులొక్క భూతప్రభూతములని
తెలియు నాతడు భూతవిస్తృతమునెర్గి
పొంద గల్గునుబ్రహ్మంబు భూపవర్య! 507

గీ. అటుల నాదియు నిర్గుణుం డవ్యయుండు
నైనపరమాత్మ దేహంబు నందెయుండి
యెట్టి పనినైన చేయక యట్టెయుండు;
నభిమతంబైన దేనిని యంటకుండ. 508

గీ. సూక్ష్మ మైనట్టి యవ్యక్త శూన్యమైన
యాక సంబెల్లు దేనిని నంటకుండ
సర్వ గతముగ వ్యాపింప జాలినదియొ,
యట్లె పరమాత్మ సర్వభూతాత్మలందు
నంట కుండగ నుండున వ్యక్తుడగుట. 509

ఆ. లోకమందునిలిచి లోక బాంధవుడగు
సూర్యుడొకడె వెల్గు చూపినట్లు,
క్షేత్రిమందునిల్చి క్షేత్రిజ్ఞుడొకడే
చేతనంబుగూర్చు క్షేత్రమునకు. 510

ఆ. క్షేత్రిమునకు మరియు క్షేత్రిజ్ఞునకుగల్గు
నన్తరమునుజ్ఞాన మునవెఱింగి
భూతగుణములమరి పూర్ణంబుగానెర్గు
వారుపరమ పదము బడయుగలరు." 511

పదమూడవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## పదునాలుగవ యధ్యాయము

## (గుణత్రియ విభాగము)

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

సీ. "ఎట్టి జ్ఞానులు మునివరు లీజగాన
మోక్ష మందిరో భవబంధ ములనువీడి
యట్టి పరమాత్మ విజ్ఞాన మాదియందె
తెలిపి యున్నను మరలనే తెలుపుచుంటి
జ్ఞాన ములనది యుత్తమ మైనదగుట. 512

ఆ. ఇట్టి జ్ఞానమాశ్రి యించినమానులు,
యస్మదీయధర్మ మందివారు,
ప్రిసవ కాల మందు ప్రిభవింపకుందురు,
లయము గనరు మరియు ప్రిళయవేళ. 513

గీ. బ్రిహ్మ పాలించుప్రకృతి యేప్రిసవమగుచు
భూత కోటుల బుట్టించు భూమిగాగ;
భూమి గర్భాన నేబీజ ముంపగానె
సంభ వంబయ్యె భూతాళి సర్వమిలను. 514

గీ. భూత యోనులబుట్టిన భూతిములకు
తల్లి యగుచుండు ప్రికృతియే స్థానముగను,

తండ్రి నేనౌదు బీజసంస్థాపకునిగ
ఇదిర హాస్యము యెఱుగుమో యిందిరతనయ. 515

గీ. ప్రకృతి జములగు గుణములే బంధములుగ
నవ్యయంబగు క్షేత్రజ్ఞ నశ్వరమగు
క్షేత్రమునకును గట్టిన చిత్రమిద్ది,
సత్వ రాజస తామస సగుణమలది,
యిదిర హాస్యము యెఱుగుమో యిందిరతనయ. 516

గీ. అందు సత్వంబు గుణముల నమరగుణము
కాంతిమంతంబు సుఖశాంతి కారణమగు,
జ్ఞాన సంపాదనమునకా సక్తిమాపు
జీవు బంధించి క్షేత్రమున్ జేర్చుచుండు. 517

●. రాజసగుణమద్ది రాగసంభరితమై
కోరి కలనుజలము లూరఁజేయు,
కామమునకు దగిన కర్మసంగముగల్గు
జీవు గట్టివైచు క్షేత్రమునకు. 518

ఆ. తామసంబు గుణము ధరగలప్రజలను
మోహమునను ముంచి మూఢులుగను
జేయుచుండు గాన జీవునట్టులుచేసి
దేహమందుపేర్చు దేవునిచ్చ. 519

ఆ. సత్వ గుణము వలన సౌఖ్యంబుగల్గును,
రాజ సమున కర్మ రక్తిగలుగు,
తామ సమున వచ్చు ధరణిపై నాపద
దేహ ధారు లవగు త్రిఫలములివి. 520

ఆ. సత్వగుణము హెచ్చి చంపును రాజస
తామసంబులనెడు ధరణిజముల;
నట్లె రాజసంబు నధికమైయుడగార్చు
సత్వ తామ సముల సత్వరముగ. 521

ఆ. తామ సంబు నట్లె ధరణిముంచెత్తుచు
సత్వ రాజ సముల చంపివేయు,
ఇట్టు లొక్క గుణము గట్టిదై వృద్ధియై
చంపు తక్కు రెంటి సత్వరంబు. 522

ఆ ఈశరీరమందు నింద్రియద్వారాల
బుద్ధి యనెడు జ్ఞానవృద్ధియెపుడు
కాంతి వంత మగుచు కన్పించుచుండునో
యపుడె సత్వ వృద్ధి యనితలపుము. 523

ఆ. ద్రవ్యలోభ ముమరి దళితకర్మాసక్తి
అశమ, మాశ యనెడు నాగుణములు

రాజసంబు హెచ్చి రగిలినయప్పుడే
భూత ములకు పుట్టు భూపవర్య ! 524

ఆ. అప్రకాశ మోహ మప్రవృత్తియెగాక
మరిప్రమాద మనెడు మహితగుణము
తామసంబు హెచ్చి తలకెక్కినప్పుడే
తనుల తాంత మగును ధరణిప్రజకు. 525

గీ. సత్వ గుణవృద్ధి యగుచున్న సమయమందు
దేహ మునువీడి పోయిన దేహియెవడో,
యట్టి యాతడు నుత్తము డరుగునట్టి
పరమ పదమును శీఘ్రమే బడయగలడు. 526

గీ. రాజసంబును హెచ్చిన రాగవేళ
దేహ మునువీడి పోయిన దేహిపుట్టు,
కర్మ ఠులయిండ్ల కర్మసాంగంబుచేత;
తామసముగూడ హెచ్చిన తరుణమందు
తనువు చాలించు దేహియు ధరణిమరల
జంతు జాలంబు లిండ్లను జననమందు. 527

ఆ. సత్వగుణుడుచేయు సత్కర్మములకును
శాంతిఫలమటంచు శాస్త్రవిదులు,
రాజసుండుచేయు రాగకర్మములకు
కష్ట ఫల ముహెచ్చుగలుగటంచు 528

ఆ. తామసుండు చేయు తలమీరు కర్మంబు
తెచ్చు మూఢ ఫలము హెచ్చుగాగ
ననుచు శిష్టులెల్ల రాడిరి త్రైగుణ్య
కర్మఫలములమరి మర్మములను. 529

ఆ. సత్వ గుణము వలన జ్ఞానంబుపుట్టని
రాజసమున బుట్టురాగలోభ
మువల తామసమున నతిమోహమనియును
శిష్టులైనవారు చెప్పిరిగద. 530

ఆ. సత్వ కర్ముడరుగు సత్యలోకమునకు
కర్మ భూమినిబడు కర్మసంగి,
తామసుడును మూఢ తమయోనులంబుట్టు
దేహములను వీడి దేహులిట్లు. 531

ఆ. ఈగుణములు గాక యితరమెయ్యదియును
కర్త గాదు యెట్టి కర్మమునకు,
ననియె ఱింగి మరియు నగుణునెఱింగిన
యతడు మోక్షమునకు నర్హుడగును. 532

ఆ. దేహకారణమగు త్రిగుణాలనెవ్వడ
తిక్రమింప గలడో స్థిరమతండు
జరయు మృత్యు భయము జన్మంబులేనట్టి
మోక్ష పదమునందు భూపవర్య !" 533

అర్జునుడు అడుగుచున్నాడు.

ఆ. "త్రిగుణ ములను నటుల; తిక్రమించెడునరు
డెట్లు లుండు వాని వేగుణములో.
యవియు నతని కెట్లు లయ్యెసాధ్యంబని
యడిగెకృష్ణునప్పు డర్జునుండు." 534

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

గీ. "సత్వరాజస తామస సగుణములకు
వశము గాకుండు నాతడు వసుధమీద
త్రిగుణ భావంబు లగుమూటి తేజములగు
జ్ఞాన మునుగాని కర్మసంగమునుగాని
మోహ మునుగాని ద్వేషింపఁబోడతండు;
యవియె తననుండి వేఱుగానైనయపుడు
వాని నాశింప కుండెడు వాడుసుమ్ము. 535

గీ. గుణవి కారంబు లనులెక్క గొననివాడు,
కర్మ ములకును గుణములే కారణమని
తలచి యాతడు మరితట స్థముగనుండి
కష్ట సుఖముల నొకరీతి గాంచుచుండు. 536

గీ. మాన మవమాన ములరెంటి మదిదలపక
ప్రియము నప్రియ ములురెండు వేరనకయె

స్వపర భేదంబు లేనట్టి సమగుణుండు;
మూడు గుణముల నిర్జించు వాడుసుమ్ము. 537

గీ. మట్టి బెడ్డని, కనకంబు, మరియినుమని,
మూటికొక్కటె వెలయిచ్చి మోజుపడని,
యేమి యత్నంబు చేయని సోమరియును
నగున తీతుడు త్రిగుణాల కవనియందు. 538

గీ. వ్యభిచ రింపక యితరాశ్రయములొనర్చి
యొక్క నామీద నేభక్తి నుంచువాడు
త్రిగుణ భావంబు లకునున తీతుడగును
నీయు పాయంబు నెఱుగుమో యింద్రతనయ. 539

గీ. అక్షరంబునునవ్యయ మైనయట్టి
బ్రహ్మ మునకును శాశ్వత ధర్మమునకు
సుస్థి రంబగు స్థానంబు సుమ్ము నేను
నిశ్చ యంబుగ ముక్తికి నిలయమేను;
ఈయు పాయంబునెఱుగుమో యింద్రతనయ. 540

పదునాలుగవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## పదునైదవ యధ్యాయము

### (పురుషోత్తమ ప్రాప్తియోగము)

ఆ. ఊర్ధ్వమూలముగను నుద్ధితమైనట్టి
రావిచెట్టుఃభూమి పాకినట్లు
బ్రహ్మవలనబుట్టి భవబంధములతోడ
ప్రకృతిభూతములును పాకుభువిని. 541

ఆ. అవ్య యంబునైన యశ్వత్థవృక్షపు
పత్ర చయము వేద పన్నములని;
యెఱుగు వారు వేద మెఱిగినవారని
శిష్టులైనవారు చెప్పుచుండ్రి. 542

ఆ. వృక్షశాఖలలము త్రిగుణప్రవృద్ధమై
చిద్విలాసముగను చివురుదొడిగి
యలము కొనునుశాఖ లాశాంతములకును
మిన్నమన్నుకలుపు చున్నయట్లు. 543

ఆ. దీనిభూమినుండి తిలకింపలేమోయి
మొదలునడుము మరియు తుదియులేని
దిదియనాదిసిద్ధ మిట్లున్న యదిమరి
సుదృఢమూలమగుచు సుస్థిరముగ. 544

ఆ. సంగసక్తులెవరు సంసారపాదప
మూలముట్టెఱుంగ జాలరోయి;
యుడియ సంగ మనెడి యాయసఖడ్గాన
నరుక బడును మూల మెఱుగఁబడును. 545

ఆ. మూల మెఱిగి యువల మూలకారణమగు
పరమ పురుషు డెఱుగఁ బడెనటంచు
వాని పదము బడయ వాంఛించుటన్న దే
మోక్ష యత్న మోయి భూపవర్య ! 546

గీ. మాన మభిమాన ముడిగిన మానవులును
సంగ రహితులు నాత్మవి జ్ఞానరతులు,
సుఖము దుఃఖంబు నొకటిగాఁజూచువారు,
లాభరక్తియునష్టవి రక్తిగాని
చెంద కుండని నిర్ద్వంద్వ చిత్తులుభువి
నవ్య యంబగు మోక్షంబు నందగలరు. 547

గీ. సూర్య చంద్రుల తేజంబు చూపలేని
అగ్నిహోత్రుని కాంతులు నరయలేని
దేని చేరిన మానవుల్ తిరిగిరారో
యట్టిదేదీప్య మానమౌ నమరపదము
మోక్ష పదమందు రదినాది భూపవర్య ! 548

గీ. అటుస నాతనమైననా యంశమొకటి
జీవ భూతంబులందలి జీవమగుచు

జ్ఞాన పంచక మునుగాక మానసమును
లాగు చున్నది సూదంటు రాయిపగిది. 549

ఆ. ఈశ్వరాంశజీవు డీశరీరమునందు
నున్న యపుడుపోవు చున్నయపుడు
పరిమళమునుగొనెడు వాయువునట్టులే
తస్కరించుజ్ఞాన షష్ఠకమును. 550

ఆ. జ్ఞానపంచకమును మానసంబును గూడ
నాశ్రయించియున్న యీశ్వరాంశ
జీవమగును భోక్త జీవభూతములందు
కష్టసుఖములకును కామమునకు. 551

గీ. ఇట్టిజీవుని యజ్ఞాను లెఱుగలేరు
దేహధారులు మరియు విదేహులైన
దేహమందుండి భోక్తయై తేలుచున్న
జ్ఞానియొక్కడు మాత్రమే దానినెఱుగు
జీవునింగూడ నాత్మగాచెప్పవచ్చు. 552

గీ. యత్నమొనరించి యోగులునైనవార,
లాత్మ తమయందెయున్నట్టు లరయుచుండ్రి;
యత్న మొనరించి యవివేకులైనవార
లంతరంగానగాంచలే రాత్మనుమరి. 553

గీ. ఎట్టితేజముసూర్యుని యెఱుకపఱచె
యెట్టితేజముచంద్రుని యెఱుకపఱచె
యెట్టితేజమువహ్నిని యెఱుకపఱచె
యెట్టితేజంబు లోకంబు నెఱుకపఱచె
నట్టితేజంబు నేనని యరయుమోయి. 554

గీ. భూమినేనుండి భూతాలమోయుచుంటి
నమృతకిరణుడ నేనుగానోషధముల
నన్నమునుగూడ పంచెదనవనిప్రజకు
పచనమొనరింతు నగ్నినై భక్ష్యములను;
నారగింతునుజఠరాగ్ని నగుచువాని. 555

గీ. జీవకోటులయందలి జీవమేను,
జ్ఞప్తి నేనౌదుజీవుల జ్ఞానమేను
మఱపుగూడనునావల్ల గలుగుచుండు
వేదవేద్యుడనేనౌదు వేదమేను. 556

గీ. ఉపనిషత్తులయుక్తికి నుపమనగుదు,
కర్తనగుదును వేదాంతగ్రంథములకు,
తత్వమనగనునేనె సూధరణిమీద;
నీరహస్యమునెఱుగుమో యింద్రతనయ. 557

గీ. ఇరుతెరంగుల భూతంబు లిలనుగలవు
క్షరము లనియును మఱియునక్షరములంచు

క్షరము లందుఁబుట్టిభూత జాలములను
అఖిల భూతాలకూటస్థు డక్షరుఁడగు. 558

గీ. మూఁడులోకాలు వ్యాపించి మోయువాఁడు
శాశ్వతుండును జగముల శాసకుఁడును
నైన పరమాత్మపురుషుఁడై యలరుచుండు
క్షరుని యక్షరు మించిన స్థిరుఁడొకండు;
అట్టి వాఁడను నేనోయి యర్జునమరి. 559

గీ. క్షరుని కంటెను మరియన క్షరునికంటె
వేరు గానున్న పురుషుఁడ వేదవిదుఁడ;
పూరుషోత్తము డను నేన పూర్వుఁడనని
యవని మేయుండఁ గాంచితి సుప్రసిద్ధి. 560

గీ. ఎవ్వ డజ్ఞానిగాకుండ నిట్టినన్ను
పూరుషోత్తముగానెంచి పుడమిగలఁడో
యట్టి యాతఁడు విజ్ఞుఁడై నందువలన
భక్తి నాపూజసల్పెడి రక్తిగనును. 561

గీ. గుహ్యతమమైన శాస్త్రంబు గురుడనగుచు
నీకుచెప్పితి కౌంతేయ: లోకమందు
దీనిచక్కఁగ నెఱిగిన మానవుండు
చేయువలసిన విధులను చేసిమఱియు
జ్ఞానవంతుడునగుచుండె సవ్యసాచి. 562

పదునైదవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## పదునారవ యధ్యాయము

### (దైవాసుర సంపద్విభాగయోగము)

ఆ. అభయ, మార్దవంబు, నంతఃకరణశుద్ధి,
శమము, దమము, ధృతియు శాంత్యహింస,
జ్ఞాన, యోగనిష్ఠ, సత్యమక్రోధంబు,
త్యాగ, దాన, తపము, ధర్మనిష్ఠ: 563

ఆ. సిగ్గు, తేజము, శుచి, స్నేహసౌశీల్యము
విషయ, లోలుపతకు విముఖతయును,
చపలరహితముమరి స్వాధ్యాయపరతయు
మంజుభాషణంబు మానవతయు. 564

ఆ. ద్రోహమాడకుండు కోమలగుణమును
స్వాతిశయము లేని సద్గుణమును,
ననెడునిరువదారు గుణములజనియింత్రు
దైవసంపదగల ధన్యులుమరి. 565

సీ. అసురసంపదతో బుట్టి నట్టివారు
దంభదర్పంబులనుగల్గి దయనువీడి
పరుషముగబల్కి కోపసంవర్తనులయి
యజ్ఞులుగనుందు రర్జునాయవనియందు. 566

గీ. ఉభయ సంపదలనుగల్గి యూడిపడిన
యిరుతెఱంగులమనుజుల నీవిధముగ
జ్ఞానులంచునుమఱియున జ్ఞానులనుచు
నిర్ణయించిరియర్జునా నిశ్చయముగ. 567

గీ. దైవసంపద బుట్టిన ధన్యులెలమి
మోక్షమునకర్హు లగుదురు ముఖ్యముగను,
నసురసంపదనుద్భవ మైనవారు
బంధములదెచ్చుకొనెదరు బహువిధముల. 568

గీ. దైవసంపదబుట్టి యున్నావుగాన
దుఃఖపడకుమునీవు నిర్దోషివిమగి
జ్ఞానముపార్జనంబున శ్రవణమునను
మోక్షమునుబొందు నర్హతబొందితీవు. 569

గీ. ఇరుతెఱంగులసృష్టి యీయిలనుగలదు
దైవసంబంధమైనది ధన్యమొకటి
యసురసంబంధమైనది యహమదొకటి
దివ్యసంపన్నసృష్టిని దెల్పియుంటి,
చెప్పెదనునీకు నాసురసృష్టిగూర్చి. 570

గీ. అసురసంపదతోఁ బుట్టినట్టిజనులు
విహితకర్మంబులకు ధర్మవిధులెరుగరు;
యవిధికర్మంబులకు ధర్మమరయుగలరు,

శుచితలేనట్టి యాచారశూన్యమైన
యవిధికర్మంబులకె వారలలవడుదురు. 571

గీ. జగము బూటకమనియు నీశ్వర మటంచు
నప్రతిష్ఠిత మదియని యనుటె కాక
యాలు మగలకుఁబుట్టిన యదియటంచు
కామ మొక్కటె జగతికి కారణమని
యసురసంపదబుట్టువా రనెదరోయి. 572

గీ. ఇట్టినాస్తికబుద్ధితో బుట్టినట్టి
యల్పులసురులు నష్టాత్ములైనవారు
లోక కంటక కృతులనేకములుగ
చేయు చున్నారులోకవిచ్ఛేదమునకు. 573

గీ. తనివి తీరనికోరికల్ తెలుపుచుండ
దంభ మభిమానమదముల జృంభణమున
నజ్ఞులగుచునునను చిత్తమైనవాని
కోరిచేయుచునుందురు దుష్కార్యములను 574

గీ. మరణపర్యంతమటు చింతనుగ్రగ్గిపోయి
జీవిలక్ష్యముకామోప జీవనమని
యాశ వెంబడియాశకై యఱ్ఱుచాచి
దేనినందక తానును తృప్తిగనక
ధనమునార్జింతురు స్వపరభేదంబులేక
తీరకుండెడికోరికల్ తీర్చుకొనగ. 575

ఆ. ఆశకలిగెనాకు నదినేడుఫలియించు
దానినందగలను తనివిదీర,
ఇట్టియాశలన్ని యీజన్మసఫలత
కందగలనుతనివి చెందగలను. 576

ఆ. ఈధనంబునాది యింతకాదిరెట్లు
కూడఁబెట్టగలను కొదువలేదు;
ఆశకంతులేదు, అబ్ధికెల్లలులేవు
ధనవిదాహుఁడమరి తనివినాది. 577

ఆ. పగతుచంపగలను బలమునాకున్నది
పరభయంకరుఁడను పురహరుఁడను;
యీజగానికేనె యీశ్వరుండనుమరి
యెదురెవండునాకు నిందులేదు. 578

ఆ. దానయజ్ఞములను తప్పకచేసియా
నందమంది నేను నలరగలను;
ననెడుకోరికలతో యజ్ఞానమోహముచే
నసురసంపదగల యుండఁజెట్టి. 579

ఆ. మోహవలయములను మున్గుచుతేలుచు
బెదరుచిత్తములను బెడదతోడ
కామభోగములకు కడదాకదాసులై
నరకకూపముననె యురుకుచుంద్రు. 580

ఆ. తమకుగలవుమహిత దంభదర్పములని
వినయహీనులైన యనయశీలు
గవిధి పూర్వకముగ యజ్ఞంబులొనరింతు
సోమ యాజు లమని సోకుచేసి. 581

గీ. ఆత్మ దేహంబులనెగాక యఖిల దేహ
ములను వసియించునన్నెపు దలపఁబోక
విషయ వలయాలచిక్కిన యసురవరులు
నన్ను సూయను ద్వేషించు చున్నవారు. 582

గీ. అట్టియధములకామేచ్ఛ కనుగుణముగ
క్రమము దప్పింపకుండగ క్రమముగానె
కూ్రరచిత్తులనవిధుల కులములందు
పుట్టునట్టులు సేతును పురుషుడనయి. 583

గీ. అసురయోనులబడి యటులజ్ఞులగుచు
గలెముకంటెను నధమమౌ గతులనంది
భ్రష్టులగుచుండి కోరికల్ బడయలేక
జన్మజన్మకునను బొంద జాలకుంట. 584

గీ. కామమేగాక క్రోధ లోభములుగూడ
నాకనాశన హేతువు లగుచునవ్వి
నరకమార్గంబులైనవి ధరణిప్రజకు
కానవిడువంగవలెవాని మానవుండు 585

గీ. తమముతో నున్న నరలోకముననైన
త్రిగుణ భావంబులకు తానతీతుడగుచు
యాత్మహితమును గావించు నట్టివాడు
మోక్షమును బొందుచున్నాడు భూమిమీద. 586

ఆ. శాస్త్రవిధినిబట్టి సకలకర్మములను
చేయకుండనిచ్ఛ చేయువాడు
సిద్ధిముక్తిసుఖముచెందఁ బోవడుసుమ్ము
శాస్త్రమందువలన సమ్మతంబు. 587

ఆ. చేయదగినపనిని చేయకూడనిదాని
నిర్ణయించుకొనగ నీకుపార్థ
శాస్త్రమున్నదోయి సప్రమాణంబుగా
దానిబట్టిచేయ దగునుపనులు. 588

పదునారవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## పదునేడవ యధ్యాయము

(శ్రద్ధాత్రయ విభాగము)

అర్జునుడు అడుగుచున్నాడు.

ఆ. "శాస్త్రవిధినివిడిచి సర్వదేవతలకు
శ్రద్ధగలిపూజ సల్పువారి
శ్రద్ధయెట్టిదగునో సత్వరజస్తమో
గుణములదగుశ్రద్ధ గూర్చిచెపుము." 589

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

ఆ. "శ్రద్ధకూడత్రిగుణ సంబంధమైనది
తెలియవచ్చుదాని దేహిబట్టి
సత్వగుణులశ్రద్ధ సత్వమైనదిమరి
రాజసులదిశ్రద్ధరాగమయము 590

ఆ. తామసులదిశ్రద్ధ తామసభవమని
ముత్తెఱంగులదది ముఖ్యముగను,
అనుచునిర్ణయించి రద్దానివివరణ
వేఱుచేసిచెప్పుదు వినుముపార్థ ! 591

ఆ. శ్రద్ధపుట్టుచుండు జన్మలసంస్కార
మంటినట్టిప్రాణి కనుగుణముగ

రూపుదాల్చి మరియు రూఢంబుగానది
వారికిష్టమైన దారిచూపు. 592

ఆ. సత్వగుణులుకొల్త్రు సాధు దేవతలను
రాజసులును యక్ష రాక్షసులను
తామసులును క్షుద్ర దైవములగు భూత
ములను గాక ప్రేతములను గొల్త్రు. 593

ఆ. శాస్త్రవిధిని విడిచి స్వపర భేదము లేక
సర్వులకును బాధ సంభవించు
తపము చేయుచుంద్రు దంభదర్పములతో
కామదాసులమని ఘనులమనియు. 594

ఆ. అట్టివారలు తమ యధిభూతములనున్న
పంచభూతములను పరమునన్ను
హింసచేయుచుండి రెంతయోగావున
అసురనిష్ఠవారి దగును పార్థ ! 595

ఆ. అందఱికిరుచించు నాహారమది గూడ
త్రిగుణయుతమెయగును తెలియుమోయి
అట్లెవారు చేయు యజ్ఞయాగాదులు
తినెడుతిండిబట్ట త్రివిధములగు. 596

ఆ. ఆయువొసగునట్టి యారోగ్యమైనట్టి
సత్వమును బలంబు సౌఖ్యమిచ్చు

చమురు రసముతోడి సాత్వికాహారంబు
సత్వగుణులరుచికి సరిపడునది. 597

ఆ. ఉప్పుపులుసుకార ముష్ణంబుచేసెడి
ఘాటుగలిగినట్టి మోటుతిండ్లు
చమురులేకనోరు సగమెండబెట్టెను
భోజనంబుప్రియము రాజసులకు. 598

ఆ. సారముడిగినట్టి చల్లారిపోయిన
రాత్రివండినమరి రసములేని
యాగమునకుగాని యన్నముచ్ఛిష్టము
తామసులకుప్రీతి ధరణిమీఁద. 599

ఆ. శాస్త్రవిహితమైన సర్వకార్యములను
చేసితీరవలయు స్థిరుడునగుచు
ఫలముగోరనట్టి పరమయజ్ఞంబులు
సాత్వికంబులగుచు జగతిబరగు. 600

ఆ. ఫలముగోరువారి పౌరుషకార్యంబు
లహముతోడచేయు నట్టివగుట
రాజసులకుదగిన రాగయుక్తములని
తెలిసికొనుముపార్థ తెల్లముగను. 601

ఆ. శాస్త్రవిధివిరుద్ధ సంతర్పణములేని
మంత్రదక్షిణలును మనసులేని
యాగమొకటెతామ సాశ్రియకర్మగా
చెప్పుచుండ్రిపార్థ శిష్టులెలమి. 602

ఆ. సురఽభూసురులను గురువులప్రాజ్ఞుల
గొలుఁచుటాదికృతులు కోరుకొనుట
శౌచమార్జవంబు సద్బ్రహ్మచర్యము
హింస దేహధారి కిలతపంబు. 603

ఆ. నొప్పిగలుఁగనీని సొప్పుగూర్చెడిదైన
మంచిచేయునట్టి మమతతోడి
సత్యభాషణంబు స్వాధ్యాయపరతయు
వాక్తపంబులగును ప్రాణులకును. 604

ఆ. మనసునిర్మలమయి మౌనంబుగానుంట
ఆత్మనిగ్రహమున నడగియుంట
మానవతనుగల్గి మర్మంబులేకుంట
మానసతపమోయి మానవులకు. 605

ఆ. పైనచెప్పినట్టి వాగ్దేహమానస
యజ్ఞములను మూటినమితశ్రద్ధ
సిద్ధ్యసిద్ధులందు చిత్తముంపకచేయు
తపముసాత్త్వికమగు ధరణిమీద. 606

ఆ. సత్కారణములకును సన్మానమునందంగ
నాచరించుయజ్ఞ మవనిమీద
దంభయుతమునగుచు దరిలేనియాశల
మోజుపడినదగును రాజసులకు. 607

ఆ. అట్లుమోజుపడిన యాయజ్ఞమేవారి
దంభదర్పమునకు తగినదైన
ఫలమునిచ్చుచుండు పరమంబుగాకది
నిష్ఫలంబెయగును నీరసమయి. 608

ఆ. మొండిపట్టుపట్టియుండి యాత్మకుగాని
పరులకైనగాని పనికిరాని
పనియొనర్చువాడె పరమతామసుడగు
నట్టిపనియెవాని కగుతపంబు. 609

ఆ. పుణ్యదేశమెర్గి పుణ్యకాలంబెర్గి
పుణ్యునెర్గియొక్క పుణ్యమునకె
దానమిచ్చునట్టి మానవుండగుసుమ్మి
సత్వదాతగాగ సవ్యసాచి. 610

ఆ. ప్రతిఫలంబుగోరి యతికష్టమునమరి
ఎపుడొవచ్చులాభ మెరిగియిపుడె
దానమొసగునట్టి దాతరాజసుడగు
నవనిదాతలందు నర్జునమరి. 611

గీ. దేశ కాలోచితములను దెలిసికొనక
తగిన సత్కార మొనరించి తనుపహసించ
నర్థి నవమానపఱచుచు నర్థ మొసగు
దాన మేనోయి తామస దానమనగ. 612

గీ. తత్స దోమ్మని మాటిచే తలపఁబడిన
బ్రహ్మ మందుండి పుట్టెఁ బ్రాహ్మణులును
వేద ములునాల్గు యజ్ఞయా గాదులెల్ల,
భూత ములకును ముందున్న మూలమగుట. 613

గీ. అందువలననె బ్రాహ్మణులాగమోక్త
విధులనెరవేర్చుకొని యెపువేళలందు
దానతపములుచేసెడి తరుణములను
నుచ్చరింతురు ముందుగానోమ్మటంచు. 614

గీ. అట్లెమోక్షంబునాశించు నవనిసురులు
ఫలితమాశింపఁబోవని పరమధనులు
విధులనెఱవేర్చుకొని యెడివేళలందు
'తదితి' యనిచెప్పుకొనెదరు తప్పకుండ. 615

గీ. సదితియనుబ్రహ్మ నామముసాధువయ్యె
బ్రహ్మమున్నదియనుటకు బలముగలిగె
నదియె యుత్తమమ్మైనదన్ ప్రధనుదెచ్చె
నుత్తమోత్తమ కర్మమందుచ్చరింప. 616

గీ. యజ్ఞదానాదికంబుల యందుశ్రద్ధ
అట్టికర్మంబుచేయు టట్లైననిష్ఠ
కర్మమొనరించుకర్తగా కారణముగ
సదితియనిచెప్పు కొనెదరోసవ్యసాచి. 617

ఆ. శ్రద్ధలేకచేయు సకలకర్మంబులు
సదితిగాకమరియు సత్తులగుచు
నిష్ఫలంబులగుచు దుష్ఫలంబులనిచ్చు
నిందునందుగూడ నింద్రితనయ." 618

పదునేడవ యధ్యాయము సమాప్తము.

# భగవద్గీత

## పదునెనిమిదవ యధ్యాయము

### (మోక్షసన్యాస యోగము)

అర్జునుడు అడుగుచున్నాడు

గీ. "వేయిచేతులతోనున్న విశ్వరూప
వ్యష్టిగానున్న నాదగు సృష్టిలోని
త్యాగసన్యాసముల రెంటి తత్వములను
కేశహారుడవుగావున కృష్ణనాకు
వేరు వేరుగ దెల్పుము వినెదవాని. 619

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

గీ. "వేదవిధులను చేయక విడుచుటొకటె
సన్యసించుటయనెదరు జ్ఞానధనులు
సర్వకర్మంబులను చేసి శ్రద్ధతోడ
తత్ఫలంబులవిడచుట త్యాగమగును. 620

గీ. దోషమట్టులు విధులను ద్రోయవలయు
ననుచు సాంఖ్యులు కొందఱు ననెదరోయి
విడువరానివి వేదోక్త విధులటంచు
ననెడువారలు మరికొంద రవనిగలరు. 621

గీ. రెండుపక్షంబులటులుండ పృథ్వియందు
త్యాగమును గూర్చి నాదు సిద్ధాంతమిద్ది.

మూడువిధములత్యాగ మీభూమినుండె
ననియెఱుంగుముఅర్జునా యమలచిత్త! 622

గీ. దానయజ్ఞంబులును మరితపముగూడ
విడువరానివియోయుగు విజ్ఞులకును;
అతిపవిత్రములవివారి కవనినగుట
విధుల టంచును చేతురు విజ్ఞులుమరి 623

గీ. యజ్ఞ యాగాదికంబుల నన్నిటినటు
విధులటంచునుచేయుచు వీడిమమత
ఫలితమాశింపకుంటయే పరమమగును;
అట్లుచేయుటయుత్తమ త్యాగమగును. 624

గీ. శాస్త్రవిధులైన కర్మముల్ సన్యసించు
టుత్తమంబైనపనికాదు; యుర్విమీద
యజ్ఞుడెవడైన కర్మంబులట్లువిడిన
యతనిత్యాగము తామసమైనదోయి. 625

గీ. కాయకష్టంబులకునవి కారణమని
భీతినందుచువిధులను విడుచువాడు
రాజసత్యాగియగు నోయిరాజముఖ్య
అట్టిత్యాగికిశాంతంబు త్యాగఫలము
దొరకకుండును కౌంతేయ దోర్బలయుత. 626

గీ. నియత కర్మంబు లివియని నిశ్చయించి
కష్టములకోర్చి వానిని కడకచేసి
ఫలిత మాశింప కుండిన పావనునిది
సత్వ సంబంధ త్యాగమీ జగతిమీద. 627

గీ. సాత్వికుండును త్యాగలక్షణుడుమరియు
కర్మ ఫలముల త్యజియించు కర్మతుండు
ఛిన్న సంశయుడై యుండి చిత్తమందు
ద్వేషి గాకుండ రెంటన ద్వేషియగును
క్లిష్ట కర్మంబు లనిన, యక్లిష్టములన. 628

గీ. కర్మ చయములు విడువశక్యంబుగాదు
పుడమి బుట్టిన వారికిభూపవర్య!
విధులనొనరించి ఫలమునువిడుచువాడె
త్యాగియనబడుచుండు విరాగియగుట. 629

గీ. త్యాగమొనరింపకున్నను రాగపడుచు,
కర్మములచేయునాతడు గాంచుచుండు;
మూడువిధముల ఫలములు భూపవర్య!
సౌఖ్యమందును చనిపోయి స్వర్గమందు
దుఃఖమందునునరకాన దోయబడుచు
భూమిమరిబుట్టి సుఖదుఃఖములనుబొందు. 630

గీ. అట్టిఫలముల సన్యాసియైనవాడు
యనుభవింపకయే యుండునవనిమీద

విధులనొనరించి ఫలములపీడుకతన
శాస్త్రసమ్మతమయ్యెది సవ్యసాచి. 631

గీ. కర్మములకునుపుటిగొల్పు కారణములు
ఐదుటంచునుసాంఖ్యంబు నందుగలదు
వాని వినిపింతు క్రమముగా పార్థవినుము
దేహ మొకటవకర్తగా దేహిరెండు,
నవయ వంబులుమనసుమూడ వదియగును,
నాలుగగువాని చేష్టలు వేరువేరు
నైదుఫలముగ దైవమేయగునుసుమ్మ. 632

గీ. ధర్మమైనను మరియున ధర్మమైన
మనసుచేవాక్కుచేత కర్మంబుచేత
త్రికరణంబుల గావించుసకలమైన
కర్మములకునునా ఐదు కారణములు
నరులకర్మంబులట్టులే జరుగుచుండు. 633

గీ. దేహికర్తృత్వహేతువు దేవుడెయని
సాఖ్యమట్టులుచెప్పగా స్వాత్మయొకఁడె
కర్తయంచునుతలచెడి కర్మఠుండు
తత్వమెరుగనియవివేకి ధరణిమీద. 634

గీ. తాను కర్తగనెప్పుడు తలపకుండ
నాత్మకర్మాళి ఫలములనంటకుండ

నెవఁడుకర్మంబు చేయుటనెరిగినాఁడొ
యట్టియాతఁడు లోకంబునందుహింస
లౌకికమునకుచేసినా లోకమందు
హంత కుఁడుగాకపరమార్థ మందియతఁడు
బంధితుండునుగాకుండు పాపమునకు. 635

ఆ. కర్మచోదనములు కలవుమువ్విధములు
కరణ మనియుకర్మ కర్తయనియు
తెలివి కరణమైన తెలిసినయదికర్మ
తెలుపువాఁడుకర్త తెలియుమోయి. 636

సీ. కరణ మునుమరికర్మంబు కర్తకూడ
త్రిగుణ దీప్తంబులగుటచే త్రివిధములని
సాంఖ్యశాస్త్రముదెల్పెను సవ్యసాచి
యున్నదున్నట్టులద్దాని విన్నవింతు
నెఱుగవలెదానినర్జునా యిందిరితనయ. 637

గీ. భూతచయములువేర్వేరు మూర్తులుగను
దృష్టిగోచర మైనను సృష్టిలోని
భూత కోటుల ప్రాణంబు పోల్పనొకటె
యవ్య యంబది యవ్యక్త మనెడిజ్ఞాన
మగుచు నున్నది సాత్విక మవనియందు. 638

గీ. ఆకృతునిబట్టి భూతంబు నరసినట్లె
భూతప్రాణంబులునుగూడ భూతములటు

నేరువేరనితలచెడి వీరవరుని
జ్ఞానమగునుముమ్ము రాజసమైనదవని. 639

గీ. అఖిలభూతంబులట్టులే యాత్మగూడ
చూపునకుదోచునట్టిదా రూపమనెదు
హేతుహీనముఫల హీనమింగితంబు
తామసోద్భవమైనది ధరణిమీద. 640

ఆ. రాగరహితమైనత్యాగ ఫలమునిచ్చు
తానుకర్తగాని దైవకర్మ
యహముకలేనిదగును నాశ్రియకర్మగా
సత్వగుణయుతంబు జగతిమీద. 641

ఆ. ఫలముగోరునదియు, బహుకష్టములకోర్చి
రక్తిగలిగిచేయు రాగకర్మ,
పౌరుషంబుచెంది పనిగొనునట్టిదై
రాజసమునదగును రాజముఖ్య ! 642

ఆ. కలుగబోవునట్టి కష్టంబునెఱుగని
ధనవినాశమునకు దారితీయు
ప్రాణిహింసనుమరి ప్రాణసామర్థ్యంబు
తలపనట్టికర్మ తామసులది. 643

ఆ. అహము లేని, ఫలము నాశింపఁ బోనట్టి
ధృతి వహించి యుత్సహించునట్టి
సిద్ధ్యసిద్ధులకును చిత్తంబు చెదరని
కర్త సత్త్వగుణము గలుగువాఁడు. 644

ఆ. అహముతోడ ఫలము నాశించి లుబ్ధత
లోనబయట శుద్ధి లేనివాఁడు,
హర్షశోకములకు నాలంబమగు హింస
చేయువాఁడు రాజసికుఁడు కర్త. 645

ఆ. యుక్తి లేక మొండి శక్తికి లోనైన
పామరుండు శఠుఁడు బలయుతుండు
అలసుఁడైనవాఁడు అతినీచకృత్యముల్
సల్పు కర్త తామసాశ్రయుండు. 646

ఆ. బుద్ధిధృతియు రెండు మూఁడు మూఁడయ్యెను
త్రిగుణదీప్తమైన జగమునందు;
అట్టి రెంటి భేదమభివర్ణనము సేతు
నాలకింపుమోయి అర్జునమరి. 647

ఆ. భయదమైన కర్మ బంధంబు గూర్చియు
నభయకారణంబు నరయుటకును
మోక్షకర్మములను బోధించు బుద్ధియే
సాత్త్వికంబు సుమ్ము సవ్యసాచి. 648

ఆ. పుణ్యపాపకర్మముల రెంటిగూర్చిన
శాస్త్రనిర్ణయమును సరకుగొనక
యభిమతముగుదాని నతికష్టమునచేయు
బుద్ధిరాజసంబు భూరితేజ ! 649

ఆ. ధర్మమైనదాని ధర్మంబుకాదను
కేయుపవలను విపరీతబుద్ధి
మూఢమైనదగుట కీడొనరించును
తామసులకునద్ది ధరణిమీద. 650

ఆ. మానసికములైన జ్ఞానేంద్రియములవి
విహితకర్మములను నిధిగదాల్చి
యోగమందునున్న యోగిపుంగవుధృతి
సత్వగుణయుతంబు సవ్యసాచి. 651

ఆ. ఐహికములకొఱకు నాముష్మికమువాని
కామ్యకర్మములను కడ దాల్చి
రాగయుక్తుడైన త్యాగహీనునిధృతి
రాజసునిదియగును రాజముఖ్య ! 652

గీ. పరులకపకారమొనరించుపట్టుదలను
దుష్టబుద్ధికతోడైన దుర్గుణముల
మదముశోకంబు భయమునునిదురగూడ
ధారణముచేయుధృతి యగుతామసునిది. 653

ఆ. అవనిమానవుండు నభ్యాసమునుబట్టి
చేయుకర్మములకు చెందుసుఖము
బుద్ధిధృతియునటులె సిద్ధించుత్రివిధమై
గుణభవంబుదాని గూడవినుము. 654

ఆ. ఏదిచేయునపుడు యెంతో చేదుగనుండి
యుదిఫలింపగాన యమృతమగునొ,
యట్టికర్మమునను బుట్టినసుఖమది
సత్వమైనదగును సవ్యసాచి. 655

ఆ. అమృతతుల్యమగుచు నారంభమునదోచి
పిదపనదియె పెద్ద విషమునైన
కామ్యకర్మదై కాలికసుఖమది
రాజసమునగగులుగు రాజముఖ్య. 656

ఆ. నిదురమత్తుచేత మొదటనున్నట్టులే
తుదినిగూడనల్లె తోచునట్టి
మోహమునను ద్రోయు మూర్ఖునిసుఖమది
తామసులదియనిరి తత్వవిదులు. 657

క. ప్రకృతిభవమగు త్రిగుణపరిభావితంబు
కానిదొక్కటిప్రకృతిలో గనగబోము
మర్త్యునైననుమరియు నమర్త్యునైన
యవనియందున స్వర్గంబు నందునైన. 658

గీ. ఆగుణంబులదీప్తి చేనవనిమీద
సర్వమానవులైనారు శాస్త్రవిధిని
బ్రాహ్మణులుమరి క్షత్రియవైశ్యశూద్రు
లనగనాలుగువర్ణంబులైనవారు. 659

గీ. అంతరింద్రియబహి రింద్రియములదైన
నిగ్రహంబును, తపమును నిష్కపటము
శౌచమోరిమిశాస్త్ర విజ్ఞానగరిమ
కలిగియాస్తిక్యబుద్ధితో నలరుచుంట
బ్రాహ్మణునిదైనసహజస్వభావమగును. 660

గీ. శౌర్య తేజంబులునుదాక్ష్య ధైర్యములును
దానమీశ్వర భావంబు దర్పగుణము,
యుద్ధమునకునుజంకని యోధగుణము,
క్షత్రియోచితమైనవి శక్తిదములు. 661

గీ. కృషియు గోరక్షణంబు వాణిజ్యములును
వైశ్యధర్మంబులగునుస్వా భావికముగ
శూద్రధర్మంబుభువినిశు శ్రూషగాన
కొలిచెదరువారు పైమూడు కులజులమరి. 662

గీ. ఏకు లంబునబుట్టు వారాకులంబు
విహిత ధర్మంబులనుతమ విధులటంచు

చేయువారలుకర్మ సంసిద్ధినందుఁ;
ఆత్మకర్మంబులనువీడ నట్టివారు
సిద్ధిపొందెడువిధమును చెప్పెదవిను. 663

గీ. భూతములసృష్టికంతకు హేతువెవఁడొ
సర్వమయముగ వ్యాపించు తత్వమెవఁడొ
యట్టితత్వంబునీశ్వరు డనియెరింగి
అతనికర్పణముగవిధు లాచరించి
సిద్ధినందుచున్నారు సిద్ధులవని. 664

గీ. ఆత్మధర్మముగుణహీన మైనదైన
యాచరించుటసుఖదమై నట్టిదోయి;
అన్యధర్మంబుగుణ పూర్ణమైనదైన
యాచరింపంగ నందెదవఘఫలంబు
కాన చేయుము సమరంబు కలదుసుఖము. 665

గీ. ఒక్కగుణహీన మేగాకయుర్విమీద
దోషభూయిష్టముగగూడ దోచుచున్న
స్వకులధర్మంబులను వీడచనదుపార్థ
పొగలుచిమ్మెడునగ్నివి బోలినట్లు
ధర్మములుగూడ గుణదోష దర్శితములు. 666

గీ. విషయములయందు నాసక్తి విడుచువాడు,
యాత్మనుజయించి సన్యాసియైనవాడు,

కర్మములుమాని శాశ్వతధర్మమెఱిగి
సిద్ధినందుచునున్నాడు శ్రేష్ఠగుణుడు. 667

ఆ. అట్లుసిదినంది యాబ్రహ్మమునుబొందు
విధమునీకువిన్న వింతుపార్థ;
శ్రేష్ఠమైనజ్ఞాన నిష్ఠనుసంగంబు
లేనిదానియోగ మైనదాని. 668

ఆ. నిర్మలముగబుద్ధి నియమించియాత్మను
శమదమంబుతోడి సహనమునను
నెవడు లేనిచోటనే కాంతవాసియై
యమితభోజిగాక యతిగనగుచు. 669

ఆ. ప్రియము నప్రియమును వేర్వేరుదలపక
మమత లేనియట్టి మానవుడయి,
ద్వేషభావమునను వేషంబుమార్చని
శాంతచిత్తమరి సాధువగుచు. 670

ఆ. ధ్యానయోగమందు తనువునేమఱచుచు
దంభదర్పములకు తావునిడక
క్రోధకామములను క్లేశవృద్ధినివీడు
నతడెబ్రహ్మభావ మందగలడు. 671

ఆ. అట్లుబ్రహ్మభావ మందినయాతని
యాత్మవిమలమైన దగుటచేత

దేనికోరకుండ - దేనికొఱకేడ్వక
సర్వభూతములను స్నేహతగాంచు. 672

ఆ. సర్వమయునినన్ను శాశ్వతుగానెంచి
భక్తిగలిగినా ప్రసక్తివలన
తత్వమెఱుగగోరి తత్వజిజ్ఞాసువై
యువలనన్ను బొందు యేమరగలడు. 673

ఆ. నిత్యకర్మములను నియతిచేసెడివాడు
నన్నెయాత్మదలచి యున్నవాడు
నాప్రసాదగరిమన ప్రమేయంబగు
మోక్షపదముబడయు ముఖ్యముగను. 674

ఆ. నీవివేకమునను నీనిత్యకర్మముల్
నానిమిత్తముగను న్యాసముంచి
యువియొసేసనిమరి యువియిచ్చుఫలమును
నేనెయనెడిబుద్ధి నిలుపునోయి. 675

ఆ. అట్టిబుద్ధినాకు నర్పించియున్న నీ
కష్టములనుద్రోతు కరుణతోడ;
అహముతోడనీవు నాబుద్ధియోగంబు
నాశ్రయింపవేని నాశమగుదు. 676

ఆ. అహమునాశ్రయించి యనిసేయనేనని
మొండిపట్టుపట్టి యుంటివేని
యదియుచేతగాక యాత్మప్రకృతి నిన్ను
ప్రోత్సహించునోయి పోరొనర్ప. 677

ఆ. ఆత్మకర్మమీవు అవివేకమునఁ జేసి
యాచరింపకుండు మనెదవేని
కర్మబంధమునకుఁ గట్టడి నీవది
చేయవలసివచ్చు సిద్ధమిదియు. 678

ఆ. సర్వభూతములను సర్వేశుఁడొక్కఁడే
యంత్రసారథి యటులధివసించి;
యాత్మమాయచేత నాడించుచున్నాఁడు
కీలుబొమ్మలవలె లీలగాఁగ. 679

ఆ. సర్వమయుఁడునైన సర్వేశునాతని
శరణుబొందుటొకటె సౌఖ్యదంబు
అతనికరుణవలన నాత్మశాంతినిబొంది
పుట్టుకయిక లేని ముక్తిగనెదు. 680

ఆ. ఈమహారహస్య మిప్పుడు నాచేత
చెప్పబడియె నీకు శిష్యవర్య;
అందు నీకు నేది యభిమతమైనదో
యావిధంబుచేయు మమలచిత్త. 681

గీ. నాకు ప్రియుడవుగావున లోకమందు
చెప్పుచున్నాఁడ మరియొక గొప్పమాట
అదియు నీకిచ్చు నభిలషితార్థములను
ఆలకింపుము శ్రద్ధతో నమలచిత్త. 682

గీ. బంధుభావంబుచేనైన భక్తిమసినీవు
మనసునామీఁదనేయుంచి మసలుకొనుచు
మనుజరూపముగలపర మాత్మ్మననుచు
భక్తిపూజించిచేయుము వందనంబు;
అట్లుచేసిననను బొంది యులరగలవు,
నిదిప్రతిజ్ఞగదెల్పితి నిదియుపార్థ
నాకుప్రియుడవుగావున లోకమందు. 683

ఆ. సర్వమయుడననుచు సర్వాత్మ్మనేనని
సర్వకర్మ్మములను సన్యసించి,
నన్నుశరణుబొందుచున్న వారలకేను
నఘములంటకుండు నట్లుసేతు. 684

ఆ. నీహితంబుగోరి నీకునేచెప్పిన
ఈరహస్యగీత నెపుడుకూడ
భక్తిలేనివినగ రక్తినిచూపని
తపసిగానియట్టి తామసికిని. 685

ఆ. మరియసూయతోడ మదినన్నుచూచెడి
మందభాగ్యులైన మనుజులకును,
చెప్పఁగూడనిదగు శ్రేష్ఠమైనదిమరి
యట్టివారలకిది యుంటనిదియు. 686

ఆ. ఈరహస్యగీత నీర్ష్యతోచూడని
భక్తకోటులకును భక్తితోడ

చెప్పునట్టివాడు తప్పకననుబొంది
మోక్షమందుచుండు ముఖ్యముగను. 687

ఆ. నాదుభక్తులకును నాగీతనటుదెల్పు
వానికంటెప్రియుడు మానవులను
లేనెలేడునాకు లేడోయిశిష్టుల
నతనికంటెనధికుడ వనినాకు. 688



గీ. ధర్మమునుగూర్చి మనదగుతర్కవాద
మైనగీతనుపఠియించు నట్టియతడు
జ్ఞానయజ్ఞంబుచేసిన ధ్యానయోగి
నన్నుసతతంబుపూజించు చున్నయట్లె. 689

ఆ. ఎవడసూయపడక యీగీతశ్రద్ధతో
వినునొ యట్టివాడు విగతపాపు
డగుచు కర్మతుండు నందెడుపుణ్యంబు
నందగలడుపార్థ యదినిజంబు 690



ఆ. ఇట్టినాదుబోధనే కాగ్రచిత్తత
వింటిగాదెనీవు విశదముగను;
సంశయంబుదీరి సదసద్వివేకంబు
గలిగినదియెదాని వలననీకు 691



అర్జునుడు చెప్పుచున్నాడు.

ఆ. "తొలగెసంశయములు కరుణించితివిగాన
గీతబోధచేసి కృష్ణనాకు;
అరసినాడమరియు నాత్మకర్తవ్యంబు
చేయువాడనీవు చెప్పినట్లు," 692

సంజయుడు చెప్పుచున్నాడు.

ఆ. "పార్థునకునుమరియు పార్థసారథికిని
మధ్యనైనబ్రహ్మ విద్యగూర్చి

వాదములనువింటి వరుసదప్పక రాజ
మేనుపులకరింప వీనులలర. 693

ఆ. దూరదృష్టినిమరి దూరశ్రవణమును
వ్యాసుడొసగినట్టి వానివలన
గాంచగలిగినాడ; కర్ణపేయముగా
వింటిగూడ రాజ వీనులలర. 694

ఆ. పరమపావనమగు పార్థునికృష్ణుని
బ్రహ్మతత్త్వమైన వాదములను;
విన్నకొలదినాకు విస్మయమొనగూర్చె
తలచుకొన్నకొలది తనివిదీరె. 695

ఆ. అదియుగాక రాజ! యా విశ్వరూపంబు
నద్భుతముగదోచె నరయుకొలది;
మాటిమాటికద్దిమనకృష్ణుడనిపించి
సంతసించుచుంటి స్వాంతమందు. 696

ఆ. యోగిపుంగవుడగు త్యాగి శ్రీకృష్ణుడు
పాశుపతముదాల్చు పార్థుగలిసి
ధర్మరక్షకొఱకు తరలివచ్చినపక్ష
మున కెజయముమరియు ధనసమృద్ధి." 697

పదునెనిమిదవ యధ్యాయము సమాప్తము.

శ్రీ మద్భగవద్గీతానువాదము – అచ్యుతగీతములు

సంపూర్ణము

ఓమ్ తత్సత్

శ్రీ పరబ్రహ్మార్పణమస్తు.

# గీతాస్తోత్రము

గీ. పార్థువత్సనుగాఁ జేసిగోపాలుడెలమి
నుపనిషద్గోవుదుగ్ధంబు నుత్తములకు
పంచెగీతామృతముపేర బ్రహ్మవిద్య
పదియునెన్మిదిప్రకరణ బహుళమద్ది. 1

గీ. పురుషుడెవ్వడుగీతను పుణ్యదమని
దినదినంబునుపఠనంబు దీక్షచేయు
నట్టియాతఁడు శోకమోహములులేని
విష్ణుపదమునుబొందుని శ్చయముగను. 2

గీ. భారతామృతవార్ధిని బడినయట్టి
విష్ణువక్త్రోద్భవంబుగా వెడలుగీత
యనెడుగంగోదకముద్రావి యనఘుడగుచు
జన్మరాహిత్యమునుబొందు జగతి జనుడు. 3

గీ. ఆచమించుచునొమ్మని యనుదినంబు
గీతపఠియించునాతడీ భూతలమున
పూర్వజన్మాఘములెగాక పుట్టిచేయు
నఘములంగూడనంటని యనఘుడగును. 4

గీ. జలముస్నానంబుచేసిన మలముతొలగి
దేహమలరునుశుద్ధమై దినదినంబు;

తొలగుసంసారమలము గీతోదకముల
స్నానమొనరించునరునకు జగతిమీద. 5

గీ. మానవాళినికరుణించు మాధవుదయ
మూగవారిని పలికించి మోదమందు,
కుంటివారిని నడిపించి కులుకుచుండు,
పుట్టుగ్రుడ్డికిచూపిచ్చి పొంగిపోవు
నఖిలభూతాత్మతాహీను లడుగునట్టి
పరిమితములేనియానంద వార్ధిసుమ్ము, 6

ఆ. అనుభవైకవేద్య మదృశ్యమయ్యది
అవ్యయంబు మరియు నక్షరంబు
తానునేనుగలియు తత్వమయ్యదిసుమ్ము
ప్రణవమనగమోక్ష పదమటన్న. 7

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 14 | 13 | దురపలంగ | దురపిలంగ |
| 16 | 7 | ప్రాణకి | ప్రాణికి |
| 19 | 20 | యడిగనట్లు | యడగినట్లు |
| 20 | 1 | జీవుకోటుల | జీవకోటుల |
| 20 | 18 | ధర్మవిచ్వుతి | ధర్మవిచ్యుతి |
| 21 | 11 | ఆనగ | అనగ |
| 22 | 5 | నిష్ఠవండగుటచే | నిష్ఠండవగుటచే |
| 22 | 8 | నిశ్చముగ్గడింతు | నిశ్చయముగ్గడింతు |
| 22 | 12 | గఱగురాకృత్లమునకు | గలుగడాకృత్యముః |
| 23 | 6 | సతాయ | సతామ |
| 24 | 13 | మనచు | మనుచు |
| 27 | 16 | గూడలెవెఱపెట్టి | గూడవెఱపెట్టి |
| 29 | 13 | వసుధగలమట్టి | వసుధగలయట్టి |
| 34 | 18 | యటివాడు | యట్టివాడు |
| 38 | 20 | తతులు | రతులు |
| 39 | 6 | యదిహో | యద్దిహో |
| 43 | 15 | కాములిల | కాముకులిల |
| 45 | 9 | తృపుండు | తృప్తుండు |
| 52 | 17 | చమముల | చయముల |
| 54 | 12 | ఎవవి | ఎవని |
| 60 | 6 | నిరనాటవి | నిర్జనాటవి |
| 71 | 2 | తవ్వ | తప్ప |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 74 | 16 | నునట్టి | నున్నట్టి |
| 75 | 2 | భూతములను | భూతములను |
| 75 | 14 | మధిదెవ | మధిదైవ |
| 77 | 13 | యాత్మ మోగి | యాత్మయోగి |
| 84 | 21 | చేష్టవనల | చేష్టవలన |
| 85 | 4 | తటనముగను | తటస్థముగను |
| 95 | 20 | నెనదు | నెనరు |
| 96 | 8 | టననిండి | టనునిం డి |
| 99 | 15 | వృష్ణిణ | వృష్ణివంశ |
| 99 | 17 | వ్యాను | వ్యాస |
| 119 | 7 | దావి | దావి |
| 120 | 8 | స్పృష్టమోయి | స్పృష్టమోయి |
| 120 | 16 | హింన | హింస |
| 121 | 17 | మెన | మైవ |
| 125 | 3 | పురుషలి | పురుషవి |
| 130 | 9 | సుత్తము | పుద్యాత్మ |
| 137 | 12 | జ్ఞపి | జ్ఞప్తి |
| 140 | 2 | అంగుల | అంగుల |
| 143 | 6 | నన్నెపు | నన్నెప్డు |
| 144 | 1 | నరలోక | నరకలోక |
| 159 | 14 | కత | కదక |
| 160 | 11 | కర్మదై | కర్మదైన |